Ithihasa Parisodhakamala-18

# A History
## of the
# Suryadevara Rajahs

Golden Sayings

1. Impartiality is the first necessary qualification of a true historian. A historian has to play the role of a judge and not that of a lawyer or an advocate. — — perfection in topography, chronology and facts has been the life long goal of the historian"

*Dr. Dharma Bhanu.*

2. That truth should prevail, that science must demolish myth and romance. — History is to be treated as a science, documented, accurate, and matter of fact." —Jadunath Sarkar

3. " History depends on the relations of eye witnesses and the original documents — —History students should use even Contemporary writings with caution, " except where they (authors) possessed original knowledge." —R a n k e.

4. "A history of the people is usually assumed, in the present day to be more stimulating and instructive than the records of kings and Courts; but even if true, this can only be understood of western peoples, of peoples who strive to go forward — or at least change. In the east, the people does not change." Lane Poole.

B y

Charitraka Siromani

**K. L. Narayana, B. A.**

# ప రి చి తి

ఆంధ్రదేశ చరిత్ర కెక్కదగిన కమ్మవంశము లయిదు అత్యంత ప్రాముఖ్యములై యున్నవి. అవి: 1. ముసునూరి 2. పెమ్మసాని, 3. రావెళ్ళ, 4. సూర్యదేవర, 5 వాసిరెడ్డి వంశములు. ఇందు మొదటిది శ్రీకృష్ణరాయలకు పూర్వమున నుండెను. అనగా క్రీ. శ. 1325 – 1368 కాలమునాటిది. రెండు, మూడు, నాల్గువంశములు రాయలవారికి సమకాలీనము లైనవి. వాసిరెడ్డి వంశము రాయలవారికి అనంతర కాలము లోనిది. ఇప్పుడిపుడే, ఆంధ్రచరిత్రకారులు, సుప్రసిద్ధ పరిశోధకు లైన శ్రీ వేంకటరమణయ్య, శ్రీ సోమశేఖరశర్మ, శ్రీ ఈశ్వర దత్తుగార్లు ఈ వంశములలో గొన్నిటిని గుర్తించి చరిత్రకెక్కిన వారి ఘనకార్యములను బహువిధముల బ్రశంసించియున్నారు.

సూర్యదేవరాన్వయ జలనిధికి శీతభానుండు, నిరంతర సిరులచే బరిఢవిల్లు, చేబ్రోలు వాస్తవ్యులగు శ్రీ సూర్యదేవర నరసయ్యగారికి తమవంశచరిత్ర వ్రాయించి, ముద్రించవలెనను అభిలాష, ఆసక్తిగలిగి, ఈ విషయమును చేబ్రోలు ఉన్నతపాఠశాలలో ప్రధానోపాధ్యాయులుగానున్న నాప్రియ మిత్రులు, మల్లంపాటి మధుసూదనప్రసాదు బి. ఏ; బి. యిడి; గారితో దాదాపు రెండు సంవత్సరముల కాలమునుండి చెప్పుచు వచ్చిరి. వయోవృద్ధులైన కొలది నరసయ్యగారికీ పవిత్రసంకల్పము నానాటికి వృద్ధియగుచుండెను. శ్రీ ప్రసాదుగారు నాతో ఈ విషయమునుజెప్పి ఒకనాడు నన్ను తోడ్కొనివచ్చి నరసయ్య గారితో బరిచయమొనర్చిరి. వారు నన్ను కుశలప్రశ్నంబులువేసి సత్కరించి, ఇష్టాగోష్టిగా మాటాడుచు నిట్లనిరి. "భూరియశో

విరాజితులు. అత్యకలంక చరిత్ర సంపద, నిరుపమానమైన సాహస, పరాక్రమములు గల్గిన పూర్వీకులగు మావంశీయుల చరిత్ర, లోగడ కర్ణాకర్ణిగా వినియుంటిని. ఇప్పుడు మీముఖతా విన ననవరతము కుతూహలాయత్తచిత్తుడ నగుచున్నాను. బహుశ్గ్రంథ పరిశోధకులగుమీరు దీనిని సమగ్రముగా బరిశోధించి, చారిత్రక దృష్టికోణముతో, నధిక ధీయుక్తి మెయిని, రచించుడు. 'విస్మృతాంధ్ర నాయకుల చరిత్ర' యనుపేర కమ్మవీరుల చరిత్రను శ్రీ గోగినేని వేంకటసుబ్బయ్యనాయుడుగారి ప్రేరణమున లోగడ మీరుల్లేఖించి, వారి సన్మానము బందికొని యున్నారు. చరిత్రకారులలో నొకరగు మీచేత మా 'సూర్యదేవర రాజన్యచరిత్రము' వ్రాయించి, విన కుతూహలము గల్గుచున్నది." అని తమపవిత్ర సంకల్పమును బయల్పరచిరి. నేనును ప్రహృష్టాంతఃకరణుండనై, వయోవృద్ధులు, జ్ఞానవృద్ధులు నయిన శ్రీ నరసయ్యగారి సంకల్పమును నెరవేర్ప దృఢనిశ్చయ మనస్కుండనై మనఃపూర్వకముగా నంగీకరించితిని.

ఆసమయమున నాకు, రాజరాజనరేంద్రుడు నన్నయభట్టును, బిలిపించి, తమవంశమున బ్రసిద్ధికెక్కిన పాండవులచరిత్ర విన కుతూహలము గలదని అందుచే 'భారతము' వ్రాయవలసినదని చెప్పినపద్యము జ్ఞప్తికి వచ్చినది. చాళుక్యరాజుకోరిన విధంబును 'నన్నయభట్టు' యిట్లు వ్రాసెను

చ॥ హిమకరుఁదొట్టి పూరుభరతేశకురుప్రభుపాండుభూపతుల్
క్రమమున వంశకర్తలనఁగా మహినొప్పిన యస్మదీయ వం
శమునఁబ్రసిద్ధులై విమలసద్గుణ శోభితులైన పాండవో
త్తముల చరిత్రనాకు సతతంబు వినంగనభీష్టమెంతయున్"

'అమరవాది రామనకవి, వాసిరెడ్డి భవానీ ముక్తేశ్వర ప్రసాదుకు, 'ద్రౌపదీ పరిణయ మంకిత మిచ్చుచు, వాసిరెడ్డి వంశ వర్ణనముజేసెను. ఈ కవియే 'వాసిరెడ్డీయము' వ్రాసి 'వాసిరెడ్డి వేంకటలక్ష్మీ నృసింహనాయుని' కంకితమిచ్చుచో, కృతిభర్త తనతోనిట్లువచించెనని కవి ఈపద్యమున చెప్పెను.

ఘనవాక్ప్రౌఢిమ ద్రౌపదీపరిణయ గ్రంథాది మావంశ వ
ర్ణనముం జేసితి వంచువింటిమటియున్ మాప్రాజ్యరాజ్యంబుహూ
ణనరేంద్రుల్ గయికొంటదానికగు నానాకారణంబుల్ రయం
బున నీవొక్క ప్రబంధ మార్యవరులామోదింప గావింపుమా॥

వాసిరెడ్డి సుబ్బదాసు, వాసిరెడ్డి వంశచరిత్రము వ్రాయుచు, 'మదన్వయ చారిత్రంబునొక్క ప్రబంధంబుగా రచియించి, యాచంద్ర తారార్కంబుగా వెలయింప'' యని అవతారికలో లిఖించినారు. ఇట్లు తమవంశచరిత్రల వ్రాయించుటకు, వినుటకు అనేకు లాసక్తి గల్గియుందురు. అట్టివారిలో 'శ్రీ నరసయ్య' గారొకరు. తమవంశచరిత్రను వ్రాయించుటకు కారణ భూతులు, నన్ను ప్రేరేపించినవారు నగు శ్రీ నరసయ్య గారి జీవిత చరిత్రను గ్రంథములో చివర క్లుప్తముగా లోకమునకు దెలియజేసి, చంద్రునకు నూలుపోగను సామెతగా నాకృతజ్ఞతను వెల్లడిచేసికొని ఈ గ్రంథమును వారికంకితము చేసినాను. ఈ గ్రంథరచనకు నన్ను చూపెట్టిన శ్రీ మధుసూదనప్రసాద్‌గారికి నాధన్యవాదములు. క్రీ. శ. 1804 లో 'కలనల్ మెకంజీ' మద్రాసు రాష్ట్రమునకు సర్వేజనరలుగానుండి, రాష్ట్రమంతయు బర్యటించి సేకరించిన కైఫీయతులలోని భాష గ్రామ్యములోనుండి అనేకతప్పులతో గూడియున్నది. ఈ భాషను

మార్చుటకు చరిత్రకారుల కెట్టిహక్కు లేదు. అందుచేత వాటిని యథాతథముగా ప్రచురించవలసివచ్చినది. కానగ్రహించ వేడెద.

ఇదియే 'సూర్యదేవర' వారికి సంబంధించిన మొదటి చరిత్ర. ఇంకను సూర్యదేవర వారి కుటుంబములకు సంబంధించిన చరిత్ర ఏమైన లభించునేమోయని, తెలిసికొనుటకు కృష్ణా, గుంటూరు మండలములలోని సూర్యదేవరవారి నెల్లరను **30-6-1960**–న జరుగు సమావేశమునకు చేబ్రోలు రావలసినదని శ్రీ నరసయ్యగారు ఆహ్వానించిరి. అనేక మంది సూర్యదేవర వంశీయులువచ్చిరి కాని సూర్యదేవరవారి చరిత్రకు సంబంధించిన విషయముల నొక్కరుకూడ చెప్పలేకపోయిరి. ఆనాటిసభకు సుప్రసిద్ధ చరిత్రకారులు, గుంటూరు హిందూ కాలేజిలో చరిత్రోపన్యాసకులుగానున్న శ్రీ భట్టిప్రోలు హనుమంతరావుగారు అధ్యక్షులుగా నుండిరి. కవిరాజ బిరుదాంకితులు శ్రీ కొండవీటి వేంకటకవిగారు సభా ప్రారంభకులుగానుండిరి. ఈ చరిత్రను గూర్చి నేనుకొన్ని ఘట్టముల సభలో జదివి వినిపించితిని. వేంకట కవిగారున్ను, హనుమంతరావుగారున్నూ నాకృషిని, బ్రశంసించిరి; ఆనాటిసభ యంతటితో ముగిసెను.

ఈ పద్ధతిలోనే 'వాసిరెడ్డి, పెమ్మసాని, రావెళ్ల, మునునూరి వీరుల చరిత్రను పరిశోధించి వరుసగా వ్రాయ నారంభించితిని. చరిత్రయందభిలాష గలవారు నాకు తగిన ప్రోత్సాహమిచ్చి, అభిమానించెదరని నమ్ముచున్నాను.

మోపఱ్ఱు,
16–8–1960.

ఇట్లు
కొడాలి లక్ష్మీనారాయణ.

# ఉపద

చారిత్రకశిరోమణి కొడాలి లక్ష్మీనారాయణగారు ప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు. నాగార్జునులచరిత్రనుండి మ్రోంపర్రు పరిచయాలదాకా వ్రాసినవారు. రామాయణ భారతాది యితిహాసాల్లోని 'రహస్యాల్ని' 'చారిత్రక– సాహిత్య' దృక్పథంతో వివరించిన విమర్శకులు .

వారిప్పుడు 'సూర్యదేవర' సంజాతుల చారిత్రక సన్నివేశాలను సంతరించి, సంపుటీకరించినారు. కవులు, గాయకులు వుద్దీపించిన, ఆలాపించిన రీతులలోతప్ప 'వంశ చరిత్రలు' నాడు నేడు లేవు. ఆత్మకథలు, జీవితకథలు కొంతకుకొంత ఆ రీతిని వంశచరితలుగానే వన్నెకెక్కినను, అందొకవ్యక్తి ప్రాధాన్యతకు మూలకందములైపోయినవి; ఆత్మస్తుతికి ఆకరములై, ఆత్మాశ్రయతలో జిక్కి పరాశ్రయతకు కీడుతెచ్చినవి.

నేటి రచన, పరాశ్రయ భావుకతకు, చారిత్రక దృష్టిని జోడించి, సాంఘికచరిత్రలోని భాగములను దీపించునట్టి క్రియాత్మక రచనగా చూపబడినది. పరిధిపెరుగుట పరిణతికి మూలం.

కర్త ప్రశస్తుడు, లక్ష్మీనారాయణ. నిర్మాణ కారకులు, సూర్యదేవర నరసయ్యగారు. ప్రేరణ మల్లంపాటి మధుసూదన ప్రసాద్‌గారిది. ఈ మూర్తిత్రయపు కృషి ఫలితమే యీ నీరాజనము. ఎవరి ప్రశస్తితో పేర్కొనవలెనో సందిగ్ధత కలిగిన చోటు. అయినను నరసయ్యగారిదే యీ త్రయంలో కొలికి స్థానంగా గ్రహించి తీరవలెను. దానికై వారికి ప్రత్యేకాభివందనలు. యీ రచనవలన వారు కృతకృత్యులు. మనం ధన్యులం.

తెనాలి, 20-8-60. అవ్వుల గోపాలకృష్ణమూర్తి

# విషయసూచిక



# సవరణ

38 పుట 2 పంక్తిలో మనుమండు (బదులు) కుమారుడు

# సూర్యదేవర రాజన్య చరిత్ర

---

## ౧

### 17 వ శతాబ్దములోని కొండవీటి సర్కారు స్థితిగతుల సింహావలోకనము.

కొండవీటి సర్కారును క్రీ. శ. 12 వ శతాబ్దమునుండి ఓఢ్ర రాజులు, కాకతీయ రాజులు, రెడ్డి నృపతులు వరుసగా పాలించిరి. 'ప్రౌఢ దేవరాయలను' నామాంతరము గల రెండవ దేవరాయలు (క్రీ.శ. 1423–1446) విజయనగర ప్రభువై యుండి కొండవీటి రెడ్డిరాజ్యమును జయించి పాలించుచుండెను. ఈయన తర్వాత 'మల్లికార్జునరాయలు', 'విరూపాక్షరాయలు' అను రాజన్యులు పాలించిరి. 'విరూపాక్షరాయల' కాలమున (క్రీ. శ. 1465–78) ఉత్కల గజపతిరాజులు మరల విజృంభించి కొండవీడు దుర్గమును స్వాధీనపరచుకొనిరి. శ్రీకృష్ణరాయల కాలమువరకు (క్రీ.శ. 1509–1530) కొండవీటిదుర్గము గజపతుల క్రిందనే ఉండెను. రాయలవారి తూర్పుదేశ దండయాత్రలలో క్రీ. శ. 1516 లో రాయలు గజపతినోడించి కొండవీటి దుర్గమును స్వాధీనపరచుకొని పాలించెను.

రాయల జీవితకాలములో గోలకొండ నవాబు లెవ్వరు కొండవీటి రాజ్యమును జయించలేకపోయిరి. రాయల మరణానంతరము 'కులీకుతుబ్ షా' యను గోల్కొండ నవాబు (క్రీ. శ 1512–43) మెతకు, పానగల్లు, కోయిలకొండ దుర్గము మున్నగువానిని జయించి పాలించసాగెను.

విజయనగరరాజులు తాళికోట యుద్ధానంతరము విజయనగరమును వీడి అనంతపురము జిల్లాలోని పెనుగొండ కేగి తాము దానిని రాజధానిగా జేసికొని రాజ్యమేలసాగిరి. కాని ముస్లిము ప్రభువు లూరకుండలేదు. కీ. శ. 1570 ప్రాంతమున గోల్కొండ నవాబగు ఇబ్రహీం కులికుతుబ్ షా కొండవీటిని జయించి తన ప్రతినిధి పాలకుడుగా 'ముర్తుజాఖాన్' అను వానిని నియమించగా, ఆయన తన పేరుతో కొండవీటిని ముర్తుజాంనగరు అను పేరుపెట్టి కొండవీటిసీమ నంతయు 'ముర్తుజాంనగరు' సీమయను పేరుతో రాజ్యమేలుచుండెను. కాని క్రీ. శ. 1571 లో 'తిరుమలరాజు' గొప్ప సైన్యముతో వచ్చి ముస్లిములను కృష్ణానది వరకు పారద్రోలి తిరిగి రాజ్యమును తన అధీనము చేసికొనెను. ఈయన తర్వాత శ్రీరంగ రాయల కాలములోగూడ కొండవీటిసీమ ఆయన క్రింద ఉండెను.

'కొండవీటి కైఫీయతు'నుబట్టి చూడగా కర్ణాటకరాజు 'రామరాజును' క్రీ.శ. 1565 జనవరి 24వ తేదీన ముస్లిములు తాళికోట లేక రాక్షససంగడి యుద్ధములో జంపి, కొండవీటి రాజ్యము స్వాధీనము చేసుకొని మల్కిభరాం పాదుషా

(ఇబ్రహీం కులి 1550–1580) తన క్రిందయున్న 'ముర్తుజ' అనే తురకను ఈ దేశమునకు పాలనకు బంపెనని, 'గోపీనాథ పురమని' పేర్గాంచిన కొండవీడునకు తనపేరుతో 'ముర్తుజా నగర'మని పేరిడి రాజ్యము చేయుచుండెనని, గోల్కొండ పాదుషా, ఇభరాం పాదుషా కృష్ణకు దక్షిణముననున్న వినుకొండ, బెల్లంకొండ, నాగార్జునకొండ, మాచెర్లసీమ జయించి వెలమ వారు పరిపాలించుచున్న నేలకోట, కొచ్చెర్లకోటలలో వెలమ వారిని జయించి అద్దంకి, అమ్మనబ్రోలు, కందుకూరు, పొదిల, దరిశి, కంభం, కాకర్ల, దూపాడు, తంగేడు, గురజాల, కేతవరం, కోడేపూడి మొదలగు నేలకోటలను జయించి కొండవీటిని ముట్టడించగా రాయలవారికి సంబంధించిన 'వెలుగోటి తిమ్మన్న' యిత్తడి వరహాలుజాతెం లంచం పుచ్చుకొని, శా. శ. 1502 విక్రమ వైశాఖ శుద్ధ పంచమి రోజున రాయ రావుకు లోబడి తాళపుచెవులు దాఖలుచేసి అధీనుడైనాడని, ఈయన దీనిని క్రీ.శ. 1580 లో స్వాధీనపరచుకొని, మూడేండ్లు అనగా చిత్రభాను వరకు పాలించి, తగినవారిని ఉంచి గోల్కొండకు పయనమై పోయెనని తెలియుచున్నది. (క్రీ. శ. 1582) ఇంకను గోల్కొండలోనున్న అజరత్ గారు ముర్తుజాం నగరును బాగుగా గట్టించి వినుకొండ, బెల్లంకొండ మున్నగు దుర్గముల వ్యవహారములుకూడ యిచట జరుగునట్లు ఏర్పాటుచేసి, దీనికి 'ముర్తుజాంనగరు'సర్కారని పేరిడి కొండవీటిసీమను 544 గ్రామములు, 14 సముతులు చేసి, 'పాలడ్గు, పులివర్రు, ప్రత్తిపాడు, సంతరావూరు, నూతక్కి, చేబ్రోలు, పొణం, మంగళగిరి,

మునిగోడు, నాదెళ్ళ, రావిపూడి, కూచిపూడి, గుంటూరు, తాడికొండ' ఈ విధముగ పరిపాలనావ్యవస్థలో మారు చేసిరని, కొండవీటి జిల్లాలో కర్ణాటక రాజుల కాలమున మాజూరు నాయక్వారి (Naikwari), కోట ఖిల్లాదారు హొదాలోనున్న 'మాణిక్యారావు' స్వదేశముఖ్ అనిన్ని, మానూరివారికి మజుందారనిన్నీ, పాత్రునివారికి దేశపాండ్యా గిరిన్నీ, యిచ్చి సదరు సముతులను స్వాధీనపరచి 'నాదెళ్ళ సముతుకు', హవేలి గ్రామాదులకు, 'నల్లబోతు'వారనే కమ్మ వారిని చౌదర్లుగా నియమించి, వారి పరంగా మామ్లియతు జరిగేటట్లుగా నిర్ణయించినారని యున్నది[1].

ఈ విధముగా క్రీ.శ. 1582 నాటికి కొండవీటి సీమను, గోల్కొండ నవాబును ఆవంశములో నైదవవాడగు 'ఇబ్రహీం కులి' కుమారుడగు 'ముహమ్మద్ కులి కుతుబ్ షా' పాలన చేయుచుండెను. క్రీ.శ. 1586 లో కర్ణాటకరాజు వేంకటపతి రాయలు తిరిగి దీనిని జయించ ప్రయత్నించెను; కాని సఫలీకృతుడు కాలేదు. కొండవీటిసీమ యంతయు గోల్కొండ నవాబుల పాలనలో నుండెను. వారు 'బారాముత్సద్దీలు' అను ఉద్యోగుల నేర్పరచిరి ఇంకను దేశపాండే, దేశ్ ముఖ్, మజుందార్ లేక మన్నవర్, చౌదరి అనువారినేర్పరచి ముస్లిములుపాలించుచుండిరి. మండలముమీాద జిల్లా లెక్కల అధికార్లను, శిస్తు వసూలు చేయించు అధికారులను దేశపాండేలని, దేశముఖులని పిల్చెదరని, ఈ ఇద్దరిమీాద, పోలీసుశాఖమీాద, అధికారము-

---

1. L. R. Vol. 57— కొండవీటి కైఫీయతు పుట 36–38.

కలఉద్యోగిని "మజుందార్" లేక "మన్నవర్" అని పిల్చెదరని "మెకంజీ" అను చరిత్రకారుడు వ్రాయుచున్నాడు.[2]

క్రీ. శ. 1581 నుండి క్రీ. శ. 1687 వరకు కొండవీటి సర్కారు గోల్కొండనవాబుల పాలనలో నుండెను. పైజెప్పిన ఉద్యోగులుకూడ క్రీ. శ. 1712 వర కుండిరి. అప్పటివరకు అనేకచోట్ల కమ్మవారిని చౌదర్లుగా నియమించుచుండిరి. క్రీ. శ. 1712 నుండి పై ఉద్యోగులే దేశముఖులు, మన్నవర్లు, చౌదర్లు జమీందార్లు అగుటచేత, జమీందారీ పద్ధతి అమలులోనికి వచ్చుటచేత, వారే ఉద్యోగులనేర్పరచి శిస్తువసూళ్లు చేయుచు సర్కారుకు జమకట్టుచుండిరి. గోల్కొండ పాలకులలో ఆఖరు వాడగు 'అబుల్ హుసేన్ తానీషాను (క్రీ. శ. 1674–1687) ఔరంగజీబు క్రీ.శ. 1687లో ఓడించి, ఖైదీగా గైకొనిపోయెను. ఈ తానీషా యొద్దనే అక్కన్న దండనాథుడుగను, మాదన్న మంత్రిగాను పనిచేయుచు, ఔరంగజీబుకు విరోధముగానున్న శివాజీతో తానీషాకు స్నేహముగల్పుచుండిరి. ఈ కారణము ననే ముస్లిములు అక్కన్న, మాదన్నలను జంపియుండిరి. ఔరంగజీబు గోల్కొండను జయించిన తర్వాత కొన్నాళ్ళకు దక్కను సుబేదారుగా 'నిజాం ఉల్ ముల్కు అసఫ్‌జా' అను

---

2 G. Mackenzie – Krishna District Manual –

"District accountants or Desponde, the District Collector or Desmukh and a third official who had charge of the police and seems to have exercised some supervision over the two others, bearing the name of MUZAMDAR OR MANNAVAR."

వానిని నియమించిరి. మొగలు రాజులు బలహీనులగుటచేత, కేంద్ర ప్రభుత్వము అసమర్థ మగుటచేత ఈయన క్రీ. శ. 1724 లో స్వాతంత్ర్యము ప్రకటించెను. ఈయనయే మొదటి హైద్రాబాదు నవాబు. కొండవీటి సీమలోని జమీందార్లు ఈయనకే శిస్తులు చెల్లించుచుండిరి. ఈ నిజాం నవాబు పాలనలో కూడ శిస్తువసూళ్ళకు దేశముఖ్ లు, దేశపాండ్యాలు, మన్నవర్లు మొదలగు పేర్లతోనే జమీందార్లు శిస్తు వసూలు చేయుచుండిరని అనేక కైఫీయతులు తెల్పుచున్నవి. రేపల్లె, రాచూరు జమీందార్లయిన వెలమవారు వీరి క్రింద నుండుట చేత వీరినిగూర్చి మనము తెలిసికోవలయును.

## ౨

## క్రీ.శ. 1700 నుండి రేపల్లె, రాచూరు జమీందార్ల చరిత్ర

'పద్మనాయకులు' లేక 'వెలమలు' 75 గోత్రములవారని వెలుగోటివారి వంశచరిత్రము తెలుపుచున్నది. అందు పుణ్యావలి గోత్రమువారు, మాణిక్యారావు. అతని వంశీకులు క్రీ. శ. 1700 ప్రాంతమునుండి రేపల్లె, రాచూరు జమీందార్లుగా నున్నట్లు కాన్పించుచున్నది. కృష్ణరాయల కాలము (క్రీ. శ. 1509–30) నకు పండ్రెండు తరములకు ముందు కాలమునుండి ఈ జిల్లాలో వీరు స్థిరపడిరని చెప్పుకొనుచుండిరని, వీరు రేపల్లె జమీందార్లుగా తెలియబడుచున్నారని మెకంజీ వ్రాతలు

తెల్పుచున్నవి.[2(a)] కాని యిది సత్యముకాదు. గోల్కొండ నవాబుల క్రిందవారు మన్నవర్లు దేశముఖులుగా ఉండిరి కాని వారి అతి ప్రాచీనమైన హక్కుపత్రములు క్రీ. శ. 1690 నాటి రోషిల్లాఖానుచేత యివ్వబడిన ఫర్మానా, భషారత్ ఖాన్‌చే యివ్వబడిన ఫర్మానా మరియొకటియై యున్నవి. వీ రిరువురు హైద్రాబాదులోనున్న ఔరంగజీబు ప్రతినిధులు. ఈ ఫర్మానాలనుబట్టి మాణిక్యారావు రామారావును, ముర్తుజాం నగరు సర్కారు కంతటికిని మన్నవరుగాను, వినుకొండ పరగణా కాక మిగతాదాని కంతటికి దేశముఖు గాను ఏర్పరచినట్లు తెలియవచ్చుచున్నది. ఈయన అసలు నామము రామారావని, ఈయన రణరంగములలో జూపిన ప్రతాపము నుబట్టి తానీషా యీాయనకు మాణిక్యారావు అను బిరు దొసంగెనని తెలియుచున్నది.

మఃట్నూరు కైఫీయతునుబట్టి (Vol. 57) క్రీ. శ. 1686 క్రోధన సంవత్సరములో సుల్తాన్ అబుల్ హసేన్ తానీషా వద్దకు, అక్కన్న మాదన్నలవద్దకు పుణ్యపల్లి గోత్రమువాడైన కృష్ణానేని రఘుపతి మాణిక్యారాయనింగారు, కొడుకు జంగ మయ్య, చేబ్రోలు దక్షిణామూర్తి సోమయాజితో గోలకొండ వెళ్ళి, అక్కన్న మాదన్నల పరంగా పాదుషా దర్శనం చేసి కొని, దేశాహి మన్నెరికములకు వరమానా వ్రాయించిరని ఉండుటచేత రూఢిగా మాణిక్యారావు, తానీషా అను పేరుగల గోలకొండ నవాబు రాజ్యము అస్తమించే ఒక సంవత్సరము

2 (a) G. Mackenzie – Krishna Dt. Manual :

కాలమునకు ముందు ఫర్మానా వ్రాయించి తెచ్చుకొనె నని స్పష్టపడుచున్నది. క్రీ. శ. 1687 లో ఔరంగజీబు గోల్కొండ నవాబు నోడించి అతనిని చెఱపట్టి అతని రాజ్యమును మొగలు సామ్రాజ్యములో గలిపివేసెను. ఈ విధముగా రెండుసార్లు మన్నవర్ హెూదా మాణిక్యారావు పొంది యుండెను. ఇంకను కొండవీడు కైఫీయతునుబట్టి మాణిక్యారావుకు స్వదేశముఖి అను పదవి ఉన్నట్లు తెలియుచున్నది[3]. పంపిణీ సమయమున రమణయ్య మాణిక్యారావుకు వృత్తి సీమవచ్చెనని భట్టిప్రోలు కైఫీయతు తెల్పుచున్నది. పోతుమఱ్ఱు గ్రామ కైఫీయతులో సర్వదేశముఖులైన మాణిక్యారావనిన్ని, విద్యపూడి లేక ఫిరంగిపురం కైఫీయతులో కర్ణాటక ప్రభుత్వములో కొండవీటి కిల్లాలకు హజారీ నాయంకరం, కోటకిల్లేదారీ హెూదాలలో ఉండి దాన పాత్రములందు ప్రవీణులైన తిరుమల మాణిక్యారావనిన్ని, కొండవీడు మొదలగు 18 గ్రామములు కిల్లేదారుడి పరంగా జరిగేటట్లు నిర్ణయించిరని, మోటుపల్లి, తెనాలి, వరగాని కైఫీయతులలో మాణిక్యారావుకు మన్నవరు హెూదా గలదని యున్నది[4]. రేపల్లె కైఫీయతులో నిట్లున్నది.[5] "కొండవీటి ఖిల్లాకు హుజూరి నాయంకరముగానున్న కోట ఖిల్లేదారికి నిర్ణయమైన కృష్ణానేని తిరుమలనాయనింగారు వుండివుండగా దక్కను పాదుషాహులు అంతా ఏకస్థులై రామదేవరాయలతో యుద్ధముచేసి జయించి దేశములు ఆక్ర

3. L. R. Vol. V Page 512
4. Ibid
5. " Page 492

మించే ఎడల సదరహి తిరుమలరాయడుగారు చేసిన యుద్ధముకు అత్యున్నత్య తేజోవిశేషములకు పాదుషాహాలకున్ను దయవచ్చి మాణిక్యారావు కితాబుయిచ్చి మన్నెవారి హొదా యిచ్చిరి. ఇదియే మన్నవర్ పదవి, కనుక సదరహి తిరుమల మాణిక్య రాయనింగారు మన్నెవారి హొదాలో ఉండి తమ పౌరుష విశేషములవల్ల దక్కన్ పాదుషాహాలయొక్క అనుగ్రహం సంపాదన చేసుకొని అనేక మన్ననల పొందిరి." ఈ కైఫీయతు లోనే అబుల్ హుసేన్ తానీషా పేరు కాన్పించుచున్నది. ముర్తుజాం నగరు సర్కారు దేశముఖు, మన్నెవారు, రుసుసాద కీలు అని షాహావారిచేత వరమానాలు పుచ్చుకొని కొండవీడు రాజధానిగా నివాసం చేసినారు. రేపల్లెలో కోట పెట్టించినారని, రాజమహాళ్ళు కట్టించుకొని నివాసముగా నుండిరని, కల్యా ణోత్సవములు జరిపించిరని యున్నది. అట్లనే 'ముకుళాపురం' అని పేర్గాంచిన 'మోటుపల్లి' కైఫీయతులో కర్ణాటక రామరాయల అధికారములో కొండవీటి ఖల్లాకు హజారీనాయంకరు ఖిల్లే దారీ హొదాలలో నుండి దానపాత్రములందు ప్రవీణులు 'తిరుమల మాణిక్యారావు'గారని, మాణిక్యారావుకు దేశముఖ్ మన్నెవారి హొదా గలదని, మానూరి, పాత్రునివారికి దేశ పాండ్యాల హొదా గలదని వ్రాయబడి యున్నది. కాని మాణిక్యారావు క్రీ. శ. 1700 ప్రాంతపువాడు. రామరాయల కాలమువాడనుట, ఆయనతో యుద్ధము చేసెననుట సరికాదు. పుణ్యావలి గోత్రమువారు, కృష్ణానేని యింటిపేరు గలిగినట్టి ఆ వంశమునకు మూలపురుషుడైన మాణిక్యారావు గోలకొండ

నవాబగు కుతుబ్ షహా వలన తాను కోవెలకొండ, మెదకు, పెదకొండపల్లి, కొండవీడు దుర్గముల గాచినందులకు బిరుదు లందినాడని రాజామాణిక్యారావని ఆయనయే బిరుదొసంగెనని ఈవంశీకులలో నొకడగు తిరుపతి (క్రీ. శ. 1774) కృతినందిన కృష్ణకవియొక్క "ధనుర్విద్యావిలాసము"లోని అవతారిక తెల్పుచున్నది. తిరుపతి, జగ్గన్న లేక జంగన్న సోదరుడు. మాణిక్యారావు కుటుంబమువారికి హైద్రాబాదు సుభాదారు సనదుల నొసంగెనని, మిగతాజమీలలో వారికి 'మన్నవర్' హోదా లేకుండా వారి హక్కుల కొనసాగించవచ్చునని, 'సిఫ్‌జంగు' కాలములో జంగన్నరావు, తిరుపతిరావు అను జమీందార్లు తప్పించుకొని పారిపోవలసి వచ్చెనని, వారి జమీలు తిరిగి తీసుకొనబడలేదని, కుంపినీవారి రికార్డులు తెల్పుచున్నవి.[6A]

ఈ కృష్ణకవి మొదట "శకుంతలాపరిణయము"ను కమ్మవారగు చిరుమామిళ్ళ పాపయ్య ప్రభుడని పేర్గాంచిన వేంకటాద్రినాయని ప్రేరణమున రచించెను. ఈ కవి యింకను 'కొమ్మాలపాటి దండకము,' 'యక్షగాన' మొకటి రచించినట్లు

---

6A- Guide to Guntur 1795 – 1835 page 148.

"The Manikya Rao family holds Sanads from the Subhadar of Hyderabad etc. Their rights may be allowed to them with the exception of exercising 'Mannavar' in the other Zamindaries. The two Zamindars Jangana and Thirupathi Rao had to fly the country in the time of Syffjung, but their estates were never resumed."

తెలియుచున్నది. ధనుర్విద్యావిలాసములోని అవతారికలో నిట్లున్నది.

సీ॥ తన యాజ్ఞ నాఁదల దాలిచి కోవెల
కొండ యేలినయట్టి నిండుదనము
పదిలుడై తాఁబాప మెదకుమ (వ)లంగర
దుర్గంబు గాచిన దొడ్డతనము
తన ముద్రఁ జెల్లించి ధనికుడై పెదకొండ
పలి దుర్గమునఁ జేయు ప్రాభవంబు
తన పంపుగని పెంపు దనరారఁగాఁ గొండ
వీటి దుర్గమునేలు విక్రమంబు
భావమున మెచ్చి కుతుపశాశివినోసఁగె
తెలనిశానీ నగారాప్రదీప్త ధవళ
చామర ద్వంద్వమును జగజంపు గొడుగు
పంచ ఘంటాతలాటంబు భద్రగజము.

వ॥ వెండియు

శా॥ ఆజానేయము రత్నకుండలయుగం బాదోళికా రత్నముం
బ్రాజాపత్యము ముర్తుజాన్నగరసామ్రాజ్యంపు మన్నె ర్థమున్
రాజామానికరావటంచు నభిధానం బిచ్చినం బ్రీతుడై
భ్రాజిష్ణుడగుచున్ దగున్ గుతుపశాపాచ్ఛాసమతుంబుగన్॥

ఈ మానికరాయ మాళి 'కుతుబ్ షా' అనుగ్రహంబున 'ఏనూట ఎనుబది నాల్గు గ్రామములలో ప్రసిద్ధమగు ముర్తుజాన్నగరంబునకుం దావలంబైన రాజ్యంబునకు మన్నెరి

కంబును దక్కుంగల సన్మానంబులుం బడసి, యప్పాదుశా పను
పున ముర్తుజాన్నగరంబు ప్రవేశించి, అచట సింహాసనంబున
కొలువుదీరి కొండవీటి రాజ్యమును బాలించెనని కవి వ్రాయు
చున్నాడు.[6] వీనియన్నింటినిబట్టి తేలు చారిత్రాంశము లేమనగా,
ఈయనకు తానీషా యను గోల్కొండ నవాబు క్రీ. శ. 1686వ
సంవత్సరములో మానిక్యారావు అను బిరుదొసంగి మన్నె
వరు హోదా నొసంగి ముర్తుజాం నగరు అను పేరుగల
కొండవీటి ఖిల్లేదారుగా నేర్పరచియుండెను. ఆయన అచటనే
ఉండి కొన్ని గృహములు కట్టించుకొని ఒక కోనేరును
త్రవ్వించెను. కొండవీటి ఖిల్లాక్రింద ఉంచబడిన హావేలీ గ్రామ
ములు 18 అని కూడ తెలియుచున్నది. హావేలి గ్రామము
లనగా ఖిల్లాదారు లేక ఫౌజుదారు క్రింద కొంత సైన్యముండు
నని, వారి పోషణ కొరకు ఈ గ్రామముల ఆదాయమును విని
యోగించెదరని తెలియుచున్నది. ఈ భూములు దేశముఖులు
లేక దేశపాండ్యాలు లేక చౌదర్ల క్రింద నుండవు.[7] ఈ 18 హావేలీ
గ్రామముల శిస్తువసూళ్ళకు నాదెళ్ళ గ్రామస్థులగు నల్ల మోతు
వారిని చౌదర్లుగా నియమించిరి. పరాసువారు ఏడు సంవత్సర
ములు పాలించినపుడు హావేలి గ్రామములు 18 కి 'పెల్లూరి
రామయ్య'ను దివానుగా నిర్ణయించి జమీందార్ల పరముగా
వ్యవహారము జరిగిస్తూ వచ్చినారని కైఫీయతులు తెల్పుచు
న్నవి. 'వాసిరెడ్డి వేంకటాద్రినాయుడను' కమ్మ జమీందారు

6. కృష్ణమాచార్యుడు — ధనుర్విద్యావిలాసము 21, 22, 23.

7. G. Mackenzie : Krishna District Manual Page 343.

'హావేలి' గ్రామములనుకూడ కొనుచుండెనని, మహలాలో ఈయనను 'హావేలి' రాజా యని పిల్చుచుండిరని ఆపట్టణములో ఆయన కట్టించిన భవనమును 'హావేలి' కచేరి యని పిల్చు చుండిరని మెకంజీ వ్రాతవలన తెలియుచున్నది.

మానిక్యారావుతో బాటు వాసిరెడ్డివారికి, మానూరి వారికి కూడ కొన్ని గ్రామములొసగి నవాబులు వారికి మన్నె వారి హోదాల నొసగినట్లు స్పష్టపడుచున్నది. వీనివలన వారి మధ్య సంతతము తగాదాలు జరుగుచుండెను. వాసిరెడ్డివారి మూలపురుషుడు 'వీరప్పనాయడు' నందిగామలో నుండి క్రీ. శ. 1670 లో గోల్కొండకేగి గోల్కొండనవాబుతో మాటాడి నందిగామ పరగణా కంతటికి "దేశముఖు"గా నుండునట్లు ఒక సనదును వ్రాయించి తెచ్చుకొనెను. ఇంకను వీరాగ్రేసరుడైన 'చినపద్మనాభుడు' క్రీ. శ. 1687 లో గోల్కొండనవాబు లోడిపోయిన తర్వాత మొగలుపాదుషా యొద్దకేగి ఆయన యొద్ద తన యశ్వారోహణ నైపుణ్యమును జూపించి మెప్పొంది మూడు పరగణాల కాధిపత్యము గల్గునట్లు సనదులగైకొని వచ్చెను. గోల్కొండనవాబువద్దనే ఈ సనదులగైకొనెనని మరి యొక చరిత్రకారుడు వ్రాసియున్నాడు.

దక్కను సుభాదారు మానూరువారికి, మాణిక్యారావు కుటుంబములవారికి పోటీగా నుండుటకు, క్రీ. శ. 1710 లో వాసిరెడ్డి కుటుంబమువారికి మరియొక ఫర్మానా కొండవీటి రాజ్య

ములో ⅓ వంతు అధికారము గల్గునట్లు జారీచేసిరి.[8] 'చినపద్మ నాభునికే ఈ హక్కుపత్ర మివ్వబడినదని ఈయనయే చింతపల్లి కోటను గట్టుకొనెనని యొకచోట, అట్లివ్వబడినది రాఘవ పురమువాసి చౌదరి రామయ్యకని యొకచోట ఉన్నది.[9] ఎట్ల యిన క్రీ. శ. 1710 నాటికి వాసిరెడ్డివారు కొండవీటిసీమ ⅓ వంతుకు 'మన్నవర్లు' అగుట స్పష్టమని చెప్పవచ్చును. బ్రాహ్మణులగు 'మానూరివారే' నందిగామ సీమనుంచి తమకు బలము కలిగించేనిమిత్తము వాసిరెడ్డివారిని గైకొనివచ్చిరని వారికికూడ ఒకవంతు కొండవీటిసీమ పంపిణీలో వచ్చినదని రేపల్లెకైఫీయతు స్పష్టముగా దెల్పుచున్నది.[10] కమ్మవారైన వాసిరెడ్డి కుటుంబమువారు వెలమలైన మాణిక్యారావు కివ్వబడిన ఫర్మానా నంగీకరించక వివాదపడి, తామే ముర్తుజాం నగరసీమ కంతటికి మన్నవర్లమని గోలకొండ నవాబు కాలమున వారు బాకీపడుట చేత ⅓ వంతు నవాబు గైకొనెనని వాదించసాగిరి. మాణిక్యా రావు కుటుంబమువారు, సదరు వాసిరెడ్డి కుటుంబమువారు నందిగామను వదలి కృష్ణానదిని దాటి క్రీ.శ. 1710 కి పూర్వము ఈవలికి రాలేదని, వారికేవిధమైన హక్కులేదని వాదించసాగిరి.

---

8. G. Mackenzie : Krishna District Manual page 308
"The Subhadar of Deccan bestowed upon the Vasireddy family authority over ⅓ of the Kondaveeti Circar that there might be a counterpoise to the two disputants."

9. Ibid – Pages 308 and 309.

10. L. R. Vol. 5. రేపల్లె కైఫీయతు.

పై తగాదా యట్లుండగా క్రీ. శ. 1710 వ సంవత్సరములో బ్రాహ్మణు లగు మానూరివారికి, మాణిక్యారావు కుటుంబమువారికి భయంకరమైన పోరాటము సంభవించెను. మానూరివారివలె 'బలభద్రపాత్రునివారు' కూడ బ్రాహ్మణులు. ఇటీవల కొంతకాలము క్రితమువరకు మానూరివారు సత్తెనపల్లి, చిలకలూరిపాడు, జమీందార్లయి యుండిరి. వారికి కూడ క్రీ. శ. 1707 నాటి ఔరంగజేబు యిచ్చిన దానపత్రము గలదు. దానిలో వారిని 'ముర్తుజాం నగరుకు' జమీందార్లుగాను, శెరిస్టాదార్లుగాను ఏర్పరచిరని యున్నది. వారి కుటుంబనామముతోబాటు బిరుదు 'ముజుందార్' అనికూడ వారు చేర్చుకొనుచుందురు. 'ముర్తుజాం నగరు' సర్కారు హక్కు విషయములోనే మానూరివారికి, మాణిక్యారావు కుటుంబము వారికి క్రీ. శ. 1707–1710 మధ్యకాలమున భయంకర పోరాటము జరుగుచుండెను. దక్కను సుభాదారు దీనినంత గాంచుచుండెను. 'ఆర్కాటు నవాబు' ఈ జిల్లాగుండ పోవుచు, ఈ తగాదాను కండ్లార గాంచి మాణిక్యారావును ఎదుర్కొని అతని నుండి కొండవీడును గైకొని, ఈ విధముగా శాంతిభద్రతల నేర్పరచి, ముర్తుజాంనగరు సర్కారులోని ⅓ వ వంతును 'వాసిరెడ్డి జమీందారు కొసంగి, తనత్రోవను తాను ఆర్కాటు కేగెను. అంతటితో ఈ తగాదా సమసిపోయెను.[11]

ఇంతకు పూర్వమే అనగా క్రీ. శ. 1705 లో మాణిక్యారావు జమీందారు రేపల్లెలో నొక కోటను గట్టించెను. రేపల్లె

---

11. G Mackenzie – Krishna District Manual. Page (319)

కైఫీయతునుబట్టి చూచిన ఈయన రేపల్లెలో కోట పెట్టించి రాజమహాళ్లు పెట్టించుకొని నివాసముగావుండి కల్యాణోత్సవములు జరిపించి క్షేత్రపాలకుడైన ఉమామహేశ్వరస్వామివారికి కల్యాణోత్సవములు జరుగ గలందులకు రేపల్లెకు తూర్పున ఉండే రుద్రవరం అగ్రహారంగా యిప్పించి అందువల్లవచ్చే ఫలసాయం వల్ల ఉత్సవములు జరిగేటట్లు నిర్ణయించినారని తెలియుచున్నది.[12]

నేడు మరియొక కోట శిధిలములు కూడ ఇచటనే కాన్పించును. ముస్లిముల జోక్యముచేతను దినదినాభివృద్ధిపొందు వాసిరెడ్డివారి అధికార ప్రాబల్యముచేతను మాణిక్యారావు అధికారము క్రమక్రమముగా క్షీణించిపోయెను. గుంటూరు సర్కారు కుంపిణీవారి పరిపాలనలోనికి పోయినపుడు వాసిరెడ్డి వేంకటాద్రినాయుడు విశేషబలవంతుడై యుండెను. ఈయనతో పోల్చిచూచిన రేపల్లెజమీందారు పూర్తిగా బలహీనుడై యుండెను.

ఈ విధముగా మాణిక్యారావు వంశీకుల పాలన దినదినము క్షీణించిపోయెనని గ్రహించవచ్చును. క్రీ. శ. 1792 లో రేపల్లె రాచూరులు రెండు ప్రత్యేక జమీలుగా చేయబడెను. క్రీ. శ. 1795 లో రాచూరు జమీందారు చనిపోయెను. ఆయన తర్వాత మాణిక్యారావు సీతన్నారావు

12. Ibid : Page No. 211

"At Repalle is a ruinous fort which was built in 1705 by the Zamindar, whose descendent now inhabit it"

అను జమీందారు పాలించెను. ఈయన సంతానము లేకుండనే క్రీ.శ. 1799 జూలై 20 వ తేదీన మరణించెను. కనుక రేపల్లె జమీందారగు భావనారాయణరావుకు రెండు జమీలు సంక్రమించెను. క్రీ. శ. 1801 లో ప్రభుత్వ బాకీల క్రింద రెండు జమీలను జప్తు చేయగా, రాచూరు భాగము అమ్మకమునకు వచ్చుటచేత, 'మల్రాజు కుటుంబము'వారు వేలములో గొని యుండిరి. తర్వాత 'మాణిక్యారావు భావనారాయణరావు' రేపల్లెజమీందారుగా 20ఏండ్లు పాలనచేసి విశేషఖ్యాతి నార్జించెను. ఈయన రేపల్లెలోనే నివసించుచు, క్రీ. శ. 1824 లో మరణించెను తరువాత పాలించినవారి కాలములో జమీందారీ ఋణగ్రస్తమగుటచేత, క్రీ. శ. 1846 లో కుంపిణీ ప్రభుత్వములో గలుపుకొనిరి. తర్వాత రేపల్లెజమీందార్లకు లవణసు (Allowance) యివ్వబడుచుండెను.

ఈవిధముగా రేపల్లె, రాచూరు జమీందార్ల విషయము ఐతిహాసిక లేఖకుల వ్రాతలను బట్టి తెలియుచున్నది. వీరే కాకుండా ఆంధ్రదేశములో కాళహస్తి, వేంకటగిరి, నూజవీడు, పిఠాపురము, కొల్లాపురము, తిరువూరు, ఉల్లిపాలెము జమీందార్లు వెలమవారై యున్నారు. నెల్లూరు జిల్లా మాన్యువల్ను బట్టిచూచిన వేంకటగిరి, కాళహస్తి, చుండి, ముత్యాలపాడు, సయ్యద్ఫూర్, ఉదయగిరి, జూపల్లి, గూడూరు, వాజెళ్ళ మొదలగుచోట్ల జమీందార్ల పాలనసాగెనని తెలియుచున్నది.[13] కొండవీటిసీమ పాలనచేసిన జమీందార్లు బ్రాహ్మణులు, కమ్మ

---

13. John A. C. Boswell – Nellore District Manual.

వారు, వెలమవారై యున్నారు. ప్రస్తుతము మనకు సంబంధించిన రేపల్లె, రాచూరు జమీల చరిత్ర క్రీ. శ. 1700 ప్రాంతము నుండియే తెలియవచ్చుచున్నది. 'గోవాడ' కైఫీయతునుబట్టి, మాణిక్యారావుకు దేశముఖ, మన్నవర్ హావాదాగలదని, తర్వాత సీతన్నకు రేపల్లె వంతున్న, మల్లన్నకు రాచూరు వంతున్న, వేంకన్నరమణప్పకు పేటేరువంతున్న వచ్చుటచేత వారు పాలించిరని, జగ్గన్నా మాణిక్యారావు రేపల్లె, పేటేరు, రాచూరులు కలిపి ఏక ప్రభుత్వముగా ఏలెనని (క్రీ. శ. 1759–1773) తెలియుచున్నది. అంతకుపూర్వము అనగా క్రీ.శ. 1400 ప్రాంతమునుండి క్రీ. శ. 1700వరకు మున్నూరు సంవత్సరములకాలము రేపల్లె, రాచూరు పేటేరు దుర్గములకు కమ్మప్రభువులగు, సూర్యదేవరవంశీయులు పాలకులైరి. కొండవీటికైఫీయతును బట్టి చూచిన క్రీ. శ. 1580 ప్రాంతమునకొండవీటిని కర్ణాటక రాజుల సామంతుడుగా 'వెలుగోటితిమ్మన్న' అను వెలమ పాలనచేసెనని గ్రహించవచ్చును. లంచగొండియైన ఈ వెలమ రాయరావుకు లొంగిపోయిన తర్వాత, 'కొండవీటిసీమ' గోల్కొండ ముస్లిముల పాలనలో నుండెను. వెలమవారు రేపల్లె, రాచూరు ప్రాంతములలో క్రీ.శ. 1400 నుండి 1700 వరకు పాలనచేసిన ఆధారములులేవు. కాన అప్పటి పాలకులగు సూర్యదేవర రాజన్యుల చరిత్ర, పుక్కిట పురాణగాథలతో కాకుండా, చారిత్రక దృష్టికోణముతో వెలికితీయుటయే ఈ గ్రంథ రచన ముఖ్యోద్దేశ్యము.

## 3

## సూర్యదేవర రాజన్యులు – పులివర్తిసీమ పాలన

రేపల్లె తాలూకాలోని 'పోలేరు' (ఓలేరు) పూర్వము పులివఱ్ఱు సముతులో, రాచూరుసర్కారులో ముర్తుజానగర్ జిల్లాలో నున్నది. ఈ గ్రామ కైఫీయతులో గణపతి గజపతి మహాప్రధానులైన 'గోపరాజు రామన్న' క్రీ. శ. 1144 నాటి సూర్యగ్రహణ వేళ 'గ్రామకరణీకాల మిరాశి నిర్ణయించినందున' అని ఉండుటచేత, ఈ గ్రామము క్రీ.శ. 12వ శతాబ్దమునాటికి వర్ధిల్లుచున్నదని చెప్పవచ్చును. క్రీ. శ. 1500 వరకు కర్ణాటక ప్రభుత్వములు, తర్వాత మొగలాయి ప్రభుత్వములు వచ్చినవని, అవుడు పులివఱ్ఱు సముతు అనే 50 గ్రామాలు ప్రత్యేకపరగణా అయినందున, ఈ 'పోలేరు' రాచూరు తాలూకాలో చేరినది. ఈ కైఫీయతు యిట్లున్నది.[14]

"ఈ పులివఱ్ఱు సముతుకు చౌదరీలు అయిన నారసింహుడు, వేములపల్లి లింగంనేడు – ఈ ఉభయులు కమ్మవారు చౌదరితనంచేస్తూఉండగా, కృష్ణ ఒడ్డునఉన్న ఆలయం శ్రీ గోపీనాథస్వామివారిది, ఉండిఉండగా, ఆ ఆలయం విడిపించి సదరహీ చౌదరులునున్నూ మచిలీబందరు కాపురస్థులయిన కొల్లా వేంకటాద్రి అనే తెలగాలున్నూ ఈ ముగ్గురున్ను యేకమై పోలేటి గ్రామానికి దక్షిణపుభాగాన నూతనంగా ఆలయం కట్టించి

---

14. L. R. 41 – పోలేరు కైఫీయతు. పుట 424

ఆ ఆలయంలో శ్రీ గోపీనాధస్వామివారిని ప్రతిష్ఠ చేయించినారు. సూర్యదేవరవారు అనే కమ్మవారు రాచూరుగ్రామములో నేలకోట పెట్టించి, పేటేరు గ్రామములోను నేలకోట కట్టించి, రేపల్లె అనే గ్రామంలో యిల్లు కట్టుకొని ఆ యింటికి నాలుగుతట్ల, ఆవరణం వేయించి అక్కడ ఆడవాండ్లనుఉంచేదిన్ని, ఈలాగున జర్పుతూ ఉండగా వేములపల్లివారికిన్ని సూర్యదేవర వారికిన్ని మనస్తాపం వచ్చి, వేములపల్లివారు సూర్యదేవర వారిని వంచనచేయవలెనని యోచించి పూర్వం కొండవీటి సీమకు అనగా కొండవీటి దుర్గానకు నాయకవాడి అయిన మాణిక్యారావు అనే పేరుగల వెలమవారు పరాక్రమమందు గట్టివారై యుండగా, వారిని కుమ్మకుగాను పిల్వనంపించుకొని కొంతమందిని జమియ్యతు కూర్చుకొనివచ్చి రాచూరు కిల్లాను, పేటేరుకిల్లాను, రేపల్లె స్థళమున్ను, వోలేరుగ్రామములో ఉండే యిల్లున్ను యివి వెలుదయినస్థళాలు ఆక్రమించుకొని, సూర్యదేవరవారికి వుండేటందుకు స్థళంలేక పరాజితులను జేసినందున 'సూర్యదేవరవారు' స్థళం విడిచి పరాజితులై పోయినారు. వేములపల్లివారుమాత్రం నిలుకడగా ఉండిఉన్నారు గోలకొండ పాదుషాహానుంచి మాణిక్యారావు అనే వెలమవారు రాచూరు రేపల్లె తాలూకాల జమీనుకు హుకుం తెచ్చుకొని జమీందారీ అనుభవిస్తూఉండి, వేములపల్లివారికి చౌదరిత్వం అక్కర లేకుండా చేసి పూర్వంనుంచి చౌదరిత్వం నేమకం అయినప్పుడు సర్వమాన్యంగాను కుచ్చలపాతికె పొలం నడస్తు ఉండిఉన్నందున, ఆ యినాం భూమి మాత్రం జారీగా నడిపిస్తూ వచ్చినారు.

చౌదరిత్వం అక్కరలేకుండా అయినది. మాణిక్యారావు జగ్గన్నారావు, తిరుపతిరావు ఈ ఉభయులు అన్నతమ్ములు గనుక తిరుపతిరావు రాచూరు తాలూకా, జగ్గన్నారావు రేపల్లె తాలూకా ఈ ప్రకారం తాలూకాలు పంచుకొని జమీందారీ చేస్తూ ఉండిరి.



రేపల్లె తాలూకాకు జమీందారుడైన 'మాణిక్యారావు భావనారాయణ రావు' అనే వెలమవారు జమీందారు చేస్తూ రేపల్లెలోనే ఉండిఉన్నారు."



పైన వ్రాసిన నేలకోటల నెవుడు కట్టిరని చెప్పుట కాధారములు లేవు కాని చాటువుల వలన పులివఱ్ఱు సీమలో 50 గ్రామములు కలవని దీనికి పాలకుడుగా క్రీ. శ. 1450 నుండి 'సూర్యదేవర తిమ్మనృపాలుడు' ఉన్నట్లు తెలిసికొన వచ్చును. ఇదియే సముతుగా ఉన్నది. ఈ 'సూర్యదేవర తిమ్మనృపాలుడే, రాచూరు పేటేకులలో నేలకోటలను గట్టించి పులివఱ్ఱుసీమ నేలుచుండెను. ఈక్రింది చాటువు దీనిని ధ్రువపరచుచున్నది.



సీ॥ పులివర్తి సీమకు భూపతిత్వము నంది
శత్రురాజులచేత శరణు గాంచు
గురుతర విప్పర్ల గోత్రాబ్ధిచంద్రులా
మీాదు పూర్వికులు భూమీా తలమున
పేటేకు రాచూరు కోటలుగట్టించి
మేటివదాన్యులై మించినారు.

కొండవీటి రెడ్డిరాజ్యమును జయించిన ప్రౌఢ దేవరాయల కాలమున (క్రీ. శ. 1423-1446) సూర్యదేవరవారు పులివర్తి సీమలో రాజ్యమేలుచు మండలాధీశులై విజయనగర రాజుల సామంతులై యుండిరి. గండికోట ప్రభువు పెమ్మసాని తిమ్మానాయుడుకూడ దేవరాయలకు సామంతుడే. విరూపాక్ష రాయల కాలమున (క్రీ. శ. 1465 – 78) ఉత్కల గజపతి రాజులు విజృంభించి కొండవీటి దుర్గమును స్వాధీన పరచుకొనుటచేత పులివర్తిసీమ కొంతకాలము గజపతుల కాలములో నుండియుండెను. మరల శ్రీ కృష్ణరాయలు క్రీ.శ. 1516 లో కొండవీటిని జయించుటచేత ఈ సూర్యదేవర ప్రభువులు ఆయనకు సామంతులై యుండిరని చెప్పవచ్చును. తిమ్మనృపాలుని తర్వాత ఎఱ్ఱయ, ఆయన తర్వాత ముసలయ నాయకుడు పులివర్తి సీమను పాలించిరి. శ్రీకృష్ణదేవరాయలతో బాటు పూర్వ దిగ్విజయ యాత్రలలో పాల్గొన్నవాడు ఈ సూర్యదేవర ముసలయ నాయకుడే. పై కైఫీయతునుబట్టి పులివర్రు సముతు 50 గ్రామములకు 'సూర్యదేవర నారసింహుడు' చౌదరీ తనముచేసినట్లు స్పష్టపడుచున్నది.[15] ఈయన కాలములోనే వెలమవారైన మాణిక్యారావు, సూర్యదేవరవారి చౌదరి తనము పోగొట్టి యుండుట స్పష్టము. కనుక సూర్యదేవరవారి రాజరికము క్రీ. శ. 1450 ప్రాంతమునుండి క్రీ. శ. 1580 వరకు, అచ్చటనుండి క్రీ శ. 1700 వరకు చౌదరీతనము సాగినదని చెప్పవచ్చును. విజయనగరరాజులపాలన అంతమొందిన తర్వాత గోల్కొండ ముస్లిములపాలన వచ్చినది. క్రీ. శ. 1579

15. L. R. — 41 — Page 471.

లో ఇబ్రహీం కుతుబ్ షా కొండవీటి ప్రభువాయెను. ఆయన బారామహల్లీల పాలన దేశముఖ్, దేశపాండ్యా, చౌదరీల నియామకము చేయుటచేత, సూర్య దేవరవారిని నవాబులు చౌదర్లుగా నియమించిరని స్పష్టముగా చెప్పవచ్చును. కొన్ని చోట్ల 'కాలర్లు' అని ఉండుటచేత వీరు పదాతి దళములోగూడ ఉన్నట్లు స్పష్టపడుచున్నది.

కైఫీయతులలో ననేక చోట్ల నేల కోటల వృత్తాంతము కాన్పించును. రాజమహేంద్రవరమునకు ఉత్తరముగా రెండు క్రోసుల దూరమున తూర్పుచాళుక్య రాజులునేలకోట కట్టిరని, రాజమహేంద్రవరము కైఫీయతు తెల్పుచున్నది.[16] మొదటి అధ్యాయములో ననేక నేలకోటల ప్రస్తావనగలదు మొత్తము మీద పులివర్రు సీమ రాచూరికోటతో సహా వేములపల్లివారి కుట్రవలన మాణిక్యారావుకు క్రీ. శ. 1700 ప్రాంతమున జేరి యుండవలయును. ఈ రాచూరి కోటలో సూర్య దేవర వారి బురు జొకటిఉండెనని, దాని నిటీవల ప్రాత జమీందారు త్రవ్వించి వేసెనని చరిత్రకారులు వ్రాయుచున్నారు.[17]

మాణిక్యారావు, సూర్య దేవరవారి కోటలను మాయోపాయమున స్వాధీనపరచుకొన్న వృత్తాంతమును కీ. శే సూర్య దేవర రాఘవయ్యచౌదరిగారు యిట్లువ్రాసెను.[18] "ఇట సూర్య దేవరవారికోట పోతుటీగకైన చొరశక్యము

16. రాజమండ్రి కైఫీయతు.
17. కొత్త భావయ్య చౌదరి— 'కమ్మవారిచరిత్ర' ద్వితీయ భాగము పే, 254.
18. క్రమమహారాజు పత్రిక – సం॥ 1936

గాకుండా బందోబస్తుగనున్నది. అష్టదిక్కులబురుజు లతి భయంకరములై పగరగుండె లగలించునవిగ నుండెను. సైనికు లప్రమత్తులై యుండిరి. వీరికి దగినటుల రాజన్నన్నో మహా పరాక్రమశాలి. కనుక లోగడ దీని యీగడ మైనేని వంశజుడు చెప్పుటయేగాక వేగులవారు సైతము వెల్లడించుటజేసి మాణిక్యారావుగారు బాహాటముగా యుద్ధము చేయుటకు వెరచి మాయోపాయమున గడతేర్చుటకు నుంకించెను.

ఒకనాటిరాత్రి యెత్తివచ్చి, రేపల్లెకు జేరువనున్న వరి కూటివారి పాలెములో వెలగవారి యిండ్లకడ నారేయి గడపి ఆనక వెడ్డిచుక్క పొడమకమున్నె లేచి ససైన్యుడై రాచూరు నకు జేరువనున్న కోయలగుంట యను చెఱువుగట్టు జేరి, యట నున్న మడుగులో సైనికులను దాచెను. లోగడ వారు పన్ను కొనిన మంత్రాంగము చొప్పున సూర్యదేవరవారి గురువు లేతెంచి ప్రయోగించిన చందంబున గళ్యాణభేరి వాయించిరి. అది విన్నదే తరువాయిగా 'నరసింహావనీంద్రుడు తమగురువు వేంచేసిరన్న సంతసమున' వారి పూర్వాచారానుగుణ్యముగ గస్తూరి, కర్పూర చందన తాంబూలాది సుగంధవస్తువులగొని, నిరాయుధులై గురుభక్తిపురస్సరముగా నటకే తేర, మాణిక్యా రావు గారు తాము దాచిన సైన్యమునకు సాంకేతికసంజ్ఞ చేయగా, వారొక్కుమ్మడి వచ్చిమ్మని వీరిపై కురికి, యెట వారి నట బదాబదలొనర్చి, నరసింహారాయని నిలువున ప్రాణ ములు తీసి కోట లగ్గవట్టిరి. కోటలోని సైన్యమునకు రాజు లేని కయ్యమైనందున, నిలువున నీరవ్వలైరి. కింకర్తవ్యతా

మూఢులైన వీరి నదమాయించి కోటజొచ్చి యర్థభాండారాధి కము లన్నియు వశ్యములు చేసికొనిరి. ఆనా డెట్టి తగాదా జరిగెనో గాని యాకోటబురుజులు మాత్రము మాణిక్యారావు గారి కంకితములై యుండక మొన్నటివరకు మావంశమువారి (సూర్యదేవర) భటులసంతతియగు యాదవుల స్వాధీనమునందే యుండెను"

పై చెప్పబడిన వృత్తాంతమునుబట్టి 'మాణిక్యారావు' రాచూరుకోటను స్వాధీనపరచుకొన్నకాలమున 'సూర్య దేవర నరసింహావనీంద్రుడు' మండలాధీశుడుగా గాక చౌదరిగా నుండెనని చెప్పవచ్చును. ఆయనయే పులివర్తిసీమకు చౌదరిగా నుండెను. ఈయన రాజుగానున్నకాలముననే రాచూరుకోటను మాణిక్యారావు స్వాధీనపరచుకొనెనని (శ్రీ) కొత్తభావయ్య రాఘవయ్య చౌదరి గార్లఅభిప్రాయము; కాని ఈయూహ సరి కాదు; ఏలనన సూర్యదేవర ముసలనీడు' (శ్రీ)కృష్ణదేవరాయల సమకాలీనుడై ఆరంట్లకోటయుద్ధమున బాల్గొనెను. అనగా క్రీ.శ. 1516 న గజపతుల యుద్ధ కాలమునాటికి 'ముసలినీడు' నలుబదిఏండ్ల యువకుడై యుండెను. ఆయన కుమారుడు 'తిమ్మనీడు,' ఈయన కుమారుడు 'పెదనారసింహుడు'. ఈయన క్రీ. శ. 1560 ప్రాంతపువాడని నిర్వివాదముగా చెప్పవచ్చును. కాన క్రీ. శ. 1700 ప్రాంతమునాటివాడగు 'మాణిక్యారావు' తో నెట్లు సమకాలీను డగును? కాన క్రీ.శ. 1700 నాటి 'నార సింహుడు' మరియొకరై యుండవలెను. ఈయనయే పులివర్తి సీమకు ఆఖరు చౌదరి.

ఇంకను 'కమ్మరివరుస' గ్రామకైఫీయతును వ్రాయుచు, పులివరమును గూర్చి వ్రాయబడినది. ఇందులో 'ఓలేరు' రేపల్లె, రాచూరు, మున్నగు గ్రామములు ఏకసుభాక్రింద చెల్లేటట్లు నిర్ణయించి 'పులివర్తివంతు' అని పేరుపెట్టి 'పాత్రుని వారిని' దేశపాండ్యాలుగానున్నూ, 'సూర్యదేవరవారు' అనే కమ్మవారిని చౌదర్లుగానున్ను, రామరాజువారి నాటనుంచి వున్న మాణిక్యారావువారిని మన్నెసుల్తానువారినిగానున్న మానూరివారిని ముజుందార్లుగానున్న నిర్ణయించిరని, తరువాత ఫ 1123 లో కొండవీటి జమీందార్లకు మూడువంతులు చేసి పంచిపెట్టేటపుడు ఈవంతు 'రమణీయ మాణిక్యారావు' వంతులో వచ్చినదని ఫ 1211 లో కుంపిణీవారు రాచూరివంతు తాలూకా వేలము వేయించిరని, రాజా వేంకటగుండారాయుడు వేలములో కొనెనని" యున్నది.[19]

'పులివర్రు' లేక 'వ్యాఘ్రపురము' గ్రామకైఫీయతును బట్టి 'సుల్తానబుల్లాపాదుషా' కాలమున రేపల్లె, రాచూరు, ఓలేరు, పేటేరు, మున్నగు 47 గ్రామములు పులివర్రు నముతుగా జేసి పాత్రునివారిని దేశపాండ్యాలుగాను, సూర్య దేవరవారు అనే కమ్మవారిని చౌదర్లుగాను, మాణిక్యారావు వారిని మన్నవర్లుగాను, మానూరివారిని ముజుందార్లుగా నిర్ణయించిరని తెలియుచున్నది. కాని యిందలి 'సుల్తానబుల్లా' క్రీ. శ. 1611 నాటి వాడగుటచేత ఈకాలము సరికాదని చెప్ప వచ్చును. అప్పటికి 'మాణిక్యారావు' పుట్టనేలేదు.

19. L. R. 56 – కుమ్మరివరున కైఫీయతు

పై కైఫీయతులు, కొన్ని కావ్యములలోని అవతారికలు, కృష్ణాజిల్లా మాన్యువలును, కుంపిణీ రికార్డులబట్టి తేలు చారిత్రాంశములేవనగా కమ్మవారైన సూర్యదేవరవారు రాజ్యపాలకులని, వారు రేపల్లె, రాచూరు, పేటేరు ప్రాంతములలో నేల కోటలు గట్టుకొని క్రీ. శ. 1450–1580 మధ్య కాలములో మండలాధీశులై యుండి, కొండవీటి సీమ ఎవరికి అధీనమైయున్న వారికి సామంతులై యుండి, పులివర్తి సీమను బాలించిరని, క్రీ శ. 1580 ప్రాంతమున గోల్కొండ నవాబుల సేనాధిపతియగు 'రాయరావు' అను మహారాష్ట్ర బ్రాహ్మణుడు పరిపాలనాపద్ధతులు సంస్కరించినప్పుడు సూర్యదేవరవారికి, వేములపల్లివారికి పులివర్తిసీమలో చౌదరీతనము ఒసంగిరని, క్రీ. శ. 1686 ప్రాంతమున వెలమవారగు మాణిక్యారావువారికి కొండవీటిలో ఖిల్లేదారు, ఫౌజుదారు, మన్నవర్, దేశముఖ్ పదవులు లభించుటచేత కొండవీటిలో రాజమహాళ్ళు గట్టించుకొని యుండెనని, చౌదరి ఉద్యోగముల విషయములో, 47 గ్రామములు గల పులివర్తి సీమలో శిస్తు వసూళ్ళ విషయములో సూర్యదేవరవారికి, వేములపల్లివారికి వైరభావములు గల్గెనని, నిర్వక్ర పరాక్రమోపేతులైన సూర్యదేవరవారితో వేములపల్లివారు జయించలేక కుట్రచేసి వెలమవారైన మాణిక్యారావు సాయము నపేక్షించిరని, అంతట ఆయన కొండవీటినుండి వచ్చి క్రీ. శ. 1700 ప్రాంతమున మాయోపాయమున పులివర్తి సీమకు చౌదరియగు సూర్యదేవర నారసింహుని చిత్రవధచేసి వారి నేలకోటలను స్వాధీనము చేసికొని, వేములపల్లివారికి చౌదరితనము ఖాయముచేసి, సూర్యదేవరవారిని పారద్రోలి, క్రీ. శ. 1705 లో

మాణిక్యారావు రేపల్లెలో కోట నిర్మించుకొనెనని, క్రీ.శ. 1710 లో వారికి, మానూరువారికి, వాసిరెడ్డివారికి గల తగాదాల వలన, ఆర్కాటు నవాబు జోక్యమువలన మాణిక్యారావు అధికారము తగ్గెనని, క్రీ. శ. 1712 లో కొండవీటి సీమను మూడువంతులుచేసి జమీందార్ల కిచ్చినపుడు మాణిక్యారావు హోదాతగ్గెనని, ఆయన కొండవీటిని వీడి రేపల్లెలో నివసింప సాగెనని, ఆయన తర్వాత వెలమవారు పాలించిరని స్పష్టపడు చున్నది.

## ౪

## తొండమాన్ చక్రవర్తి, సూర్యదేవరవారి గురువు శ్రీరంగరాజభట్టార్లు ఆంధ్రదేశమునకు వచ్చుట.

'కుమ్మరివరుస' కైఫీయతులలో నిట్లున్నది. "పూర్వము యెంబెరుమాళ్వారు, శ్రీపురుషోత్తము యిచటికి వచ్చెను. వరదరాజస్వామి ఆలయములో ఒకరోజు ఉండి, మరునాడు శ్రీకాకుళమేగి అచట స్వామిని దర్శించి వెళ్ళెను. తరువాత తొండమాన్ చక్రవర్తి వచ్చి కృష్ణలో స్నానముచేసి, స్వామిని సేవిస్తూఉండి తమకు గురుస్వాములయిన శ్రీరంగరాజభట్టార్ అయ్యవార్లంగారిని యిక్కడ స్థలానకు స్థానాచార్యులుగా నిర్ణయంచేసి, వారి అభిమతం చేత పన్నిద్రాళ్వారులవారిని వేంచేపుచేసి, గోపురము నిర్మాణముచేయించి తమ మతస్థులచేత (త్రిమతస్థులని పులివరం కైఫీయతు) ప్రసాదస్వీకారము చేయించి, 25 వైష్ణవ కుటుంబాలను యిక్కడ కాపురం ఉంచి, శ్రీ

స్వామివారికి అధికంగా ఉత్సవములు జరుగగలందులకు వస తులు ఏర్పరచి స్వస్థానమునకు వెళ్ళినారు...తర్వాత తురకలు ప్రబలినారు."

ఇంకను 'పులివట్టు' (Vol. 14-11) కైఫీయతులో కూడ యెంబెరుమాళ్లు' తొండమానుచక్రవర్తి, శ్రీరంగరాజభట్టరు, పేర్లు వ్రాయబడియున్నవి. ఈ శ్రీరంగరాజభట్టరు తొండ మాను చక్రవర్తి గురువు. ఇందులో చెప్పబడిన శ్రీరంగరాజ భట్టరు సూర్యదేవర చిననారసింహుని జనకుడగు తిమ్మనీడు గారి సమకాలీనుడని, ఆయనకు గురువని, ఆయన వైష్ణవ సాంప్రదాయముగా గురూపదేశము పొందెనని అయ్యవార్లు యిచ్చిన వంశవృక్షమునుబట్టి తెలియుచున్నది. కాని ఈ కాలము సరికాదు. సూర్యదేవరవారు గురువులవద్ద అష్టాక్షరీ మంత్రమైన "ఓం నమోనారాయణాయ" అను దానిని జపించి, వైష్ణవ భక్తులైరని ఈ క్రింది చాటువు తెల్పుచున్నది.

సీ॥ వైష్ణవసేవనా వార్ధి శశాంకుండు
సకలవిద్వజ్జన సన్నుతుండు
పరమభాగవతైక భక్తిలోలుండు న
ష్టాక్షరీమంత్ర జపానుసారి...

శ్రీరంగరాజభట్టరు వంశీకులు బుచ్చిభట్టరు వరప్ప రఘునాథభట్టరు, ఆయన కుమార్డు వేంకటనరసింహభట్టరు అయ్యవార్లంగారని తెలియబడుచున్నది, ఈ 'తొండమాన్ చక్రవర్తి' ఎవరు? ఈయన కాలనిర్ణయమును మనము చేయ

గలిగినచో, శ్రీరంగరాజభట్టరు కాలనిర్ణయమును కూడ మనము తేల్చగలము.

'విజయరాఘవరాయలును' గూర్చి వ్రాయుచు ప్రసిద్ధ పరిశోధకులైన 'శ్రీ నిడదవోలు వెంకటరావు' గారిట్లు వ్రాసిరి.

"అతడు శా. శ. 1555 శ్రీముఖ సం. శ్రావణశుద్ధ ద్వాదశీ సౌమ్యవాసరమున (క్రీ. శ. 1633) దక్షిణద్వారమున కృష్ణతీర్థమున స్నానముచేసి సంకల్పపూర్వకముగా షోడశ మహాదానములు చేసి బ్రాహ్మణులకు అగ్రహారాదికము లొసంగెను. ఇది క్రీ. శ. 1633 వ సం." [20]

క్రీ. శ. 17 వ శతాబ్దములో రచింపబడినట్టి, రామభద్రాంబ (క్రీ. శ. 1614–33) గురువైన 'చెంగల్వకాళకవి' రచించిన 'రాజగోపాలవిలాసము'ను బట్టి పైవిషయము స్పష్టపడుచున్నది. వేంకటరావుగారి వ్రాత క్రీపద్యమాధారము.

సీ॥ శాలివాహనశక సంవత్సరములు వే
యేనూరు నేఁబదియేను వరుస
చనఁగ శ్రీముఖనామ సంవత్సరంబున
శ్రావణ శుద్ధ పక్షమున ద్వాద
శిని సౌమ్యవాసరంబున దక్షిణద్వార
కను కృష్ణతీర్థమందు నియమమున
స్నానంబు గావించి సంకల్పపూర్వంబు
గాను షోడశమహాదానములను

20. Sri N. Venkatarao – The Southern School in Telugu literature. P 87.

గీ॥ ఘనతమీాఱఁ గళావతీ గర్భశుక్తి
మౌక్తికఫలంబు రఘునాథమహిపసుతుడు
విజయరాఘవ మేదినీ విభు డొసంగె
వేదవేదాంతవిదులైన విప్రులకును.

పై పద్యమునుబట్టి 'విజయరాఘవరాయలు' శా. శ. 1555 వ సంవత్సరము శ్రీముఖనామ సం. శ్రావణ శు॥ ద్వాదశి సోమవారమునాడు కృష్ణతీర్థమందు స్నానముచేసెనని స్పష్టపడుచున్నది. వేంకటరావుగారి గ్రంథములోని 'దక్షిణద్వారమున' అనునది సరియైన పదము; పై పద్యములోని 'దక్షిణద్వారకను' అనునదిసరి కాదు' అనినేను వారితో 'మదరాసు'లో మాటాడినపుడు చెప్పితిని. దీని కాధారము మెకంజీ కైఫీయతులే నని చెప్పిచూపించిన మీాదట వారంగీకరించిరి.

ఈ రాజు వైష్ణవ మతోద్ధారి. నిరంతర దానశీలి. ప్రతి దినము ఏబదివేలమందికి అన్నదానముచేయుదాత. ఈయనకు "మన్నారుదాస" యని బిరుదుగలదు. శ్రీరంగములోని రంగనాథస్వామికి 'మన్నార్గుడి రాజగోపాలస్వామికి ఈయన దానమిచ్చెను. అనేకచోట్ల ప్రాకార, గోపుర ప్రసాదములను, వైకుంఠ సభను నిర్మాణము చేసెను. దురదృష్టవశాత్తు 'విజయరాఘవరాయలు' ఈయన కుమారుడు మన్నారు దేవుడు మహారాష్ట్రులతో జరిగిన యుద్ధములో క్రీ. శ. 1673 లో మరణించుటచేత "తంజావూరు"లోని ఆంధ్రరాజుల పాలన అంతమొందినదని స్పష్టముగా జెప్పవచ్చును.

పైకైఫీయతులలో నుదాహరింపబడిన "తొండమాన్" చక్రవర్తి రూఢిగా పైన పేర్కొనబడిన విజయరాఘవరాయలు అగుట నిశ్చయము.

పుదుకోట రాజులకు తొండమానులని పేరున్నది. "తొండమాన్ వంశావళి" అను గ్రంథ రచయిత వెంకన్న అను కవి క్రీ. శ. 1750 ప్రాంతమున తొండమాను చక్రవర్తులను గూర్చి వ్రాసెను. ఈయన వారి ఆస్థానకవి, "చెంగల్పట్టు, చిత్తూరు, ఉ. ఆర్కాటు జిల్లాలతో గూడిన భాగమునకు 'తొండమండలము' అనిపేరు. ప్రస్తుత పాలకులైన 'తొండమానులు పల్లవరాయర్లవలె తొండమండలమునుండి వచ్చిరి.[21] 'త్యాగరాజన్' అను చరిత్రకారుడు చెంగల్పట్టు ఉ. ఆర్కాటు జిల్లాలు కలసిన భాగమునకు తొండమండలమని పేరుగలదని, పల్లవరాయర్లవలె వీరు తొండమండలమునుండి వచ్చిన వారని వ్రాసినాడు.[22] ఈ వ్రాతలు సత్యముగానే యున్నవి.

పుదుకోట రాజ్యమును బాలించిన వారిలో మొదటి వాడు 'రఘునాధరాయ తొండమాన్' తొండమండలమునుండి వచ్చినవాడగుటచేత ఈయనకు 'రాయతొండమాన్' అను బిరుదుగలదు. ఈబిరుదునే మిగత వారివంశీకు లనుసరించిరి.

---

21. K. R. Venkatarama Iyyer. A manual of Pudukotai State' Vol. II part-1 Page 754.
22. N. Thyagarajan – A manual of the Pudukotai State. Page – 24.

'భళిర ! తిరుమల తొండమాన్ ప్రభుకుమార
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!!'

అని చాటువులలో బలుచోట్ల గాన్పించును. వీరు 'పుదుక్కోట' ప్రభువులగుట స్పష్టము. ఈవంశములో మొత్తము పదమూడు మంది కాన్పించుచున్నారు. ఈ తొండమానులకు, మధుర నాయక రాజులతో, తంజావూరు ఆంధ్రరాజులతో సంబంధము గలదు. తంజావూరు రాజైన 'విజయరాఘవరాయలు' మొదటి పుదుక్కోట రాజగు 'రఘునాధరాయ తొండమాను' యొక్క భుజబలము ధైర్యస్థైర్యములు విని తన ఆస్థానమున కాహ్వానించెను.[23] 'కాలార్లు' అనుదారిదోపిడిదొంగలు ఆ కాలమున తీర్థయాత్రికులను దోపిడిచేసి బాధించుటచేత,' కాలార్ల' నణచుటకు 'రఘునాధరాయతొండమాన్, కృషిచేసి సఫలత పొందెను. దీనికి 'విజయరాఘవరాయలు మెచ్చి 'పెరియ రామబాణమ్' అను ఖడ్గమును బహుమతిగా నొసగెను. కొన్నాళ్ళ తర్వాత వీరిరువురికి మనస్పర్థలు జనించెను. 'రఘునాధరాయతొండమాన్ శైవుడగుటచేతను, 'విజయరాఘవరాయలు' అధికమైన వైష్ణవ భక్తుడగుటచేతను ఈయన ఆస్థానములో నుండుట కిష్టము లేక 'రాయతొండమాన్' తనరాజ్యమున కేగెను.[24] ఈ విధముగా

23. K. R. Venkatarama Iyyer – A Manual of Pudukotai State–Page 758.

24. N. Thyagarajan – A Manual of Pudukotai State. Page 31

"Raghunadha seems to have been a staunch Saivite and seeing that Vijayaraghava Naick wa

'విజయరాఘవరాయలు' వైష్ణవభక్తిని సమకాలీన కవులు కొనియాడిరి. ఈ వైష్ణవభక్తుడే ఆంధ్రావని కరుదెంచి కృష్ణా నదిలో స్నానము చేసినాడు. ఈయన సమకాలీనుడగు 'రాయతొండమాన్ క్రీ. శ. 1661 లో మరణించెను.

పుదుకోట రాజులలో 'విజయరఘునాధరాయ తొండమాన్' అను పేరుగలవారు ముగ్గురు కాన్పించు చున్నారు. ఈ ముగ్వురిలో నెవ్వరును వైష్ణవభక్తులు కారు. కృష్ణానది స్నానమునకు వచ్చియుండలేదు. ఆంధ్రావనికికూడ వారురాలేదు. కనుక కృష్ణానదికి స్నానమునకు వచ్చిన 'విజయ రాఘవరాయలనే 'తొండమాను చక్రవర్తి' యని కైఫీయతు లేఖకులు వర్ణించిరని చెప్పవచ్చును.

వైష్ణవభక్తుడైన ఈ విజయరాఘవరాయల కాలమున ఆయనయొక్క, సూర్యదేవరవారియొక్క గురువులైన 'శ్రీ రంగరాజభట్టరు' మరి 25 వైష్ణవ కుటుంబములతోబాటు క్రీ. శ. 1623 లో ఆంధ్రదేశమునకు వచ్చియుండిరనుటలో సంది యము లేదు.

ఈ గురువులు రేపల్లె, రామూరు, ఓలేరు ప్రాంతము లలో నుండి తర్వాత కుంచనపల్లి, శ్రీరంగపురము మున్నగు చోట్లకు చేరిరి. విజయరాఘవరాయలుకు గురువులైన వీరు సూర్యదేవరవారికికూడ క్రీ. శ. 1633 నుండి గురువులైరి.

---

becoming a bigoted Vaishnava, gave up all ideas of continuing to serve under him and returned to his Estate."

## ౫

## సూర్యదేవర వీరులు ఆరంట్లకోట యుద్ధమున పాల్గొనుట

విజయనగరరాజు 'శ్రీకృష్ణదేవరాయలు' (క్రీ. శ. 1509-1530) కళింగయాత్రకు బోవునపుడు, ఈయన వెంటచనిన ముఖ్య కుటుంబములవారు, 'ఆరవీటివారు, తొరగంటివారు, గొబ్బూరివారు, వెలుగోటివారు, రావెళ్ళవారు అని స్థానాపతి వ్రాసిన 'రాయవాచకము,' కుమారధూర్జటి వ్రాసిన 'కృష్ణరాయ విజయములు' దెల్పుచున్నవి. ఇందులో సూర్యదేవరవీరుల పేరు లేదు. ముసునూరి, సూర్యదేవర, రావెళ్ళ, పెమ్మసాని, వాసిరెడ్డి మున్నగు కుటుంబములవారు కమ్మవారు. వీరు సాహితీసలిల సింధులు, దానధర్మములకు నిధులు, నయానయ నిర్ణయశీలురు, ఉత్తమ జ్ఞానఘనులు అని కవులు ప్రశంసించిరి. హిందూధర్మ రక్షణార్థము ముస్లిముల ననేకచోట్ల ఎదిర్కొని ప్రాణముల గోల్పోయిన రాజన్యులు. అట్టి కమ్మవారినిగూర్చి వాసిరెడ్డియ కర్త సుప్రసిద్ధ ఆంధ్రకవి 'అమరవాది రామన' తన 'ద్రౌపదీ పరిణయము'లో నిట్లు వ్రాసెను.

ఉ. అమ్మనుజిత్పదోద్భవకులాఢ్యులలో నొక కొంద రాత్మ భా
గ్యమ్ములన కల్మిఁ గమ్మదనమంచుట దానమనీష సీప్సితా
ర్థమ్ములనిత్తు మర్థితతి రమ్మని కమ్మ లిఖించి సర్వదే
శమ్ములకంపుటన్ ధరణి సన్నుతికెక్కిరి కమ్మవారనన్.

సీ. వివిధ దేవబ్రాహ్మణ భక్తిసం
ఘటిత శీలమువారు గమ్మవారు

చటుల బాహాబలోత్సాహిత దుర్నివ
క్షకదంబకమువారు గమ్మవారు
శరణాగతవ్రాత పరిరక్షణైకదీ
క్షా విహారమువారు గమ్మవారు
నిత్యసత్యాలాప నిష్ఠావిశేషాను
గత వర్తనమువారు గమ్మవారు

గీ॥ వసుధ సట్టికమ్మవారిలో స్వాఃపురి,
వారిలో బలారివలె సధాఖి
లాసమాన విభవుడైన సదాశివనాయ
డను ఘనుం డొకడు వినుతికెక్కె.

ఈ సదాశివనాయుడు వాసిరెడ్డి వంశోద్భవుడై యున్నాడు. మఱియు 'కాళ్ళకూరి గౌరీనాథకవి, వెలిశేటి గురురాయుడు' అను కమ్మదొరకు 'ధర్మనందనవిలాసము' కృతి యొసంగుచు కమ్మవారిని గూర్చి ఇట్లు వ్రాసెను.

ఉ. క్రమ్మి విరోధి గర్వమధికమ్ముగఁ జిమ్మెడివారు కమ్మవా
రుమ్మలి కొందసీయక మహోన్నతితో శరణంబటన్న క్రో
ధమ్మెదమాని వైరుల ముదమ్మున గాచెడివారు కమ్మవా
రిమ్ముగ దానసంపద వహించిన వారలు కమ్మవారిలన్.

దక్షిణదేశమున భట్టుకులజుడు, అచ్యుతదేవరాయలకు సమకాలికుడగు పచ్చకప్పురపు తిరువేంగళకవి 'చొక్కనాథ చరిత్ర వ్రాసి, కమ్మవారైన 'గోళ్ళ పెదరామనృపతికి' కృతి యొసంగెను. ఈయన తమ్ముడు 'చినరామనృపతి'. వీరిరువురు "రామనాథజిల్లా"లోని తిరుపత్తూరుసీమను పాలించిరి. వీరు

క్రీ. శ. 1528 ప్రాంతపువారు. తిరువేంగళకవి ఇట్లు వ్రాయుచున్నాడు.

"అంచిత కొండమనాయంకరగండ మించి వర్తించు
వసుధగల్గిన కమ్మవంశ వర్ధనుడ"

రత్నాకరము గోపాలకృష్ణకవి "సౌగంధిక ప్రసవాపహరణమును వ్రాసి కమ్మవారగు 'రావెళ్లలింగనృపతి' కంకితమిచ్చెను.

ఈ క్రింది చాటువులను బట్టి, అలసాని పెద్దన పద్యమును బట్టి రాయలు 'ఆరట్లకోట' యుద్ధము చేసినట్లు స్పష్టపడుచున్నది.

ఈ ప్రసిద్ధిగాంచిన యుద్ధమును అనేకమంది చరిత్రకారులు వదలివేసినారు. విజయనగర చరిత్రకు ప్రమాణముల నుదహరించిన 'యస్. కృష్ణస్వామి అయ్యంగారు' కూడ దీనిని వదలివేసినారు.

"సీ. రాయరావుతగండ రాచపనుగువచ్చి
యారట్లకోన గోరాడునాడు
సంపెట నరపాల సార్వభౌముడువచ్చి
సింహాద్రి జయశిల జేర్చునాడు"

అని అలసాని పెద్దన్న వర్ణించుటచేత, ఆరట్లకోటకు కృష్ణరాయల ఏనుగులు వచ్చెనని స్పష్టపడుచున్నది. భయంకరమైన ఈ సంగ్రామములో మండలాధీశులగు సూర్యదేవర శూరులు పాల్గొనిరని చాటువులు తెల్పుచున్నవి.

సీ. గండరగండ నీ ఘన తురంగము నెక్కి
ఆరట్లకోట పోరాడునాడు

అని ఉండుటచేత, పద్యాంతమునుబట్టి 'సూర్యదేవర తిమ్మయ మనుమండు 'ముసలయ నాయకేంద్రుడు' ఈ రణరంగమున పాల్గొనెనని స్పష్టపడుచున్నది. ఆకొన్నసింగంబుభంగి ఈయన రణరంగములోని కురికినాడు. ఈయన ఆరట్ల యుద్ధమున పాల్గొనుటచేత, కృష్ణరాయని వెంట మిగత సేనానాయకులతో మండలాధీశులతో రాచూరిమర్గమునుండి బయలుదేరి వెళ్ళి యుండుట నిశ్చయము. ఈ యుద్ధము క్రీ. శ. 1517-20 మధ్యకాలములో జరిగియుండుటచేత, 'ముసలయ నాయకుడు' అపుడు పులివర్తిసీమకు పాలకుడుగా నున్నట్లు తెలుచున్నది. అంతకుపూర్వము ఏడుతరములక్రింద ఉన్న 'సూర్యదేవర మూలపురుషుడు' 'రామారాయడు' క్రీ. శ. 1400 ప్రాంతము లో నుండుట నిక్కువము. 'రాయవాచకము' కృష్ణరాయ విజయము' లలో వీరిపేరు లేకుండుటకు కారణము వీరు విజయనగరమునుండి బయలుదేరక, కృష్ణరాయలు కొండవీడు ప్రాంతములకు వచ్చి ఆప్రదేశమును జయించిన తర్వాత, ఈ వీరులకు కబురుపంపించినంతనే, హుటాహుటిని రణరంగమున కాయత్తులై పెండ్లికుమారులవలె, 'సూర్యదేవర ముసలనీడు' మున్నగు వీరులెల్లరు తమసైన్యములతో బాటు గజపతిరాజుల యుద్ధములో పాల్గొనుట కేగిరి. ఆరట్లకోట యుద్ధములో ఈయన ముఖ్యపాత్ర వహించి, కృష్ణరాయలచేత, మెప్పొందిన వాడగుటచేత ఈయనపేరు చాటువులలో నుదహరించబడినది. సూర్యదేవరవారికిగల బిరుదములలో 'విశాఖపట్టణ తలగుండు గండర' అని ఉండుటచేత గజపతుల రాజ్యములో ముఖ్యప్రదేశమగు 'ఆరట్ల' మున్నగు కోటలు ఆజిల్లాలో

నుండుటచేత, అచటనే సూర్యదేవర ముసలనీడు పాల్గొనుట చేత రాయలు, రణరంగమున పైబిరుదు నొసంగియుండవచ్చును. కొందరు సూర్యదేవరవీరులు 'అత్తలూరు' బయలున జరిగిన యుద్ధములో గజపతిరాజుల గజబలంబుల నెదుర్కొని పోరాడిరని, ఆపోరాటము ఏడుపగళ్లు జరిగెనని, అందు విజయలక్ష్మిని గైకొనివచ్చుటచేత '(శ్రీ)కృష్ణదేవరాయలు' వారికి కొన్ని మర్యాదలు అనగా, 'వెండికోర తాంబూలము' 'పమిడి కోరశాసయు', 'కనకదండఅందలము' 'హనుమంతుని ధ్వజమును' గల్గియుండు మర్యాదలొసంగెనని సూర్యదేవరవారి ప్రశస్తివలన తెలియుచున్నది. ఈవిషయము ది 2-4-1937 కమ్మమహారాజు పత్రికలో వ్రాయబడినదానిని (శ్రీ) కొత్త భావయ్యచౌదరి కమ్మవారి చరిత్రలో వ్రాసినారు. కాని ఈ యుద్ధ విశేషములు విపులముగా తెలియలేదు.

"కటకంబులో ఏడుంబగలు దప్పిరారాతి ధూమకేతి హితహేతి వాడిశిరంబులుగోసి ఆ గొడుగులకు విఘట్టితంబులైన గుబ్బలుగజేసి అత్తలూరిబయళ్ళ ఏనుగ ఘటంబులతో తలపడి వాటి కవచంబులు వైచి ఆగొడుగులకు పట్టు విలాసంబులుగా నొసర్చి ఆచీటివీర్ణకార్య (శ్రీ) దేవనారాయణునకు వేడుకల గంగి గోవుల జట్టివిడచిన (శ్రీ)సంపద ఎట్టిదనిన" అని (శ్రీ) రాఘవయ్య చౌదరి వ్రాసిరి. పైన పేర్కొనబడిన 'ఆరట్లకోటయే 'మెకంజీ' కైఫీయతులో 'ఆరంట్లకోటగా లిఖించబడినది. ఇది ప్రస్తుతము 'ఉరట్లకోట' యని పిలువబడుచున్నది. మెకంజీ కైఫీయతులలో, కృష్ణరాయలయుద్ధముకూడ వర్ణించబడినది. వీని నాధా

రము చేసికొని ఏచరిత్రకారుడు ఈ యుద్ధమును వర్ణించియుండ లేదు. మెకంజీ వ్రాతలను బట్టి ఈవిషయములు తెలియు చున్నవి. యాదవులు కొందరు యలమంచిలిలో ప్రవేశించిరని గొల్లరామన్న యనువానికి పెదదొడ్డ, చినదొడ్డ యని యిరు వురు కుమారులు గలరని, వారు యలమంచిలికి తూర్పు, ఈశాన్యమూలలందు ఇండ్లుగట్టుకొని గ్రామముచేసికొనిరని, అన్నతమ్ములకు విరోధము వచ్చి తమ్ముడు వేరగ్రామము కట్టు కొనెనని, గ్రామమునకు తూర్పున మూడుక్రోసులదూరమున గొల్లలు అరంట్ల తోటవేసిరని అచటి ప్రజలకు కిరాతులు, కొండప్రాంతీయులు, కోయవాండ్రవలన ఉ ప ద్ర వ ము లు గల్గకుండా, గ్రామమునకు ఉత్తరభాగమందు మట్టికోటను తాండవనదివొడ్డున గట్టించి, ఆకోటలో గ జ ప తి వారు తమ త ట్టు న నుం చి పాత్రుని సామంతులను కొందరు మన్నెవారిని కాణా ఉంచినారు. ఇది కపిలేశ్వర గజ పతి పాలనలో నుండెను. అరంట్లకోట కైఫీయతు యిట్లున్నది. "ఆకోటకు దక్షిణవుపైవున దరవాజా ఎత్తించి, కోటకు ఉత్తర భాగమునందున ఒక చెరువు త్రవ్వించి, కోటలోనుంచి చెరువులోనికి వచ్చేటందుకు ఒకవాకిలి దిడ్డి ఎత్తించినారు. కోటలోను గోపాలస్వామి దేవాలయము ఒకటుంచి, విఘ్నేశ్వ రుని ఆలయం ఒకటుంచి, రాజేశ్వరుడు అనే ఈశ్వరుని ఆల యము ఒకటుంచి ఈమూడుదేవాలయములున్ను కట్టించినారు. ఆకోటలో కావలిఉండేవారు కోటకు ఉత్తరముభాగాన ఉండి దిడ్డివాకిలి గుండా పోయి చెరువులో ఉదకం చేర్చుకొనేవారు. కోటలోఉన్న దేవాలయములోను ఉత్సవ విగ్రహాలు సువర్ణ

విగ్రహాలు ఉండేవి. ఇటుతరువాత కృష్ణరాయలు అనే నరపతి సింహాసనస్థుడు అయిన రాజు పశ్చిమరాజ్యంనుంచి సైన్యము తోకూడా వచ్చి తూర్పు కటకము తట్టుకు పోతూ ఉన్న సమయమందు 'అరంట్లకోట' ముట్టడికి దిగి పోట్లాడినకాలమందు ఆ కోటలోని దేవాలయములోని సువర్ణపు విగ్రహములు కోటలో మంచినీళ్ళబావిలో పడవేసినారు అని చెపుతున్నారు. కాని యిప్పుడు ఆబావి ఉండేస్థలము ఆనవాలు గుర్తేకనబడదు. కోటమీద కృష్ణరాయలవారు రెండురోజులు మధ్యాహ్నము పోట్లాడి మూడోరోజున సూర్యాస్తమయానకు కోట పుచ్చుకొని ఆకోటలోవున్న హతశేషులైన మన్నెవారిని, పాత్రు సామంతులను పట్టుకొని వడ్డాదికి లేచిపోయినారు. పైన వ్రాసిన అరంట్లకోట గ్రామము కృష్ణరాయలవారు పోట్లాడి కోట ఖాళీచేసిపోయిన తరువాత గజపతివారి తాణాకావ...రిగి అరంట్లకోట స్థళమునందు వుంచను లేకపోయినందున దినేదినే పోగా మిగిలిన కోటగోడలు యావత్తు పాడుఅయిఉండగాను... తరువాత కాకర్లపూడి రాయనింగారు... ఈ గ్రామము రూపుదీయించినారు. ... అటుతరువాత పూసపాటివారి అధీనము అయినది."[25] ఈవిధముగా 'అరంట్లకోట' రాయల స్వాధీనమైనది.

ఈ 'అరంట్లకోట'ను నేడు 'ఉరట్లకోట' యని పిల్చుచున్నారు. ఇది విశాఖపట్టణము జిల్లాలో నర్సీపట్టణమునకు ఈశాన్యదిశను తొమ్మిదిమైళ్ళ దూరమున ఉన్నది. ఇచ్చట 'అనకాపల్లి, ఉరట్ల, సత్యవరం, మున్నగు ప్రదేశములు

. L. R. Vol. III Page 347-355. అరంట్లకోట కై ఫీయతు

విజయనగరము జమిందారీలో నున్నవి. క్రీ. శ. 1802 లో విజయనగరము రాజా దీనిని కొనెను. తిరిగి క్రీ. శ. 1810 లో 'సాగి రామచంద్రరాజు' అను క్షత్రియుని కమ్మెను. ఈరాజు తిరిగి ప్రభుత్వమునకు బాకీపడి, ఋణములు తీర్చజాలక క్రీ.శ. 1832 లో విక్రయించుటచేత కుంపినీ ప్రభుత్వస్వాధీనములోనికి వచ్చెను.[26]

పై రెండు యుద్ధములలో సూర్యదేవరవారు పాల్గొనుట బట్టి చూడగా వారు పౌరుష ప్రధానము గల కమ్మవారని, వీరు ధైర్య, స్థైర్య, గాంభీర్యాదులు గలవారని, భల్లూకపు పట్టుపట్టి వెనుకాడకుండ శత్రువుల చీల్చి చెండాడువారని కీర్తిని కోరు వారేకాని ప్రాణమును లెక్కచేయువారు కారని స్పష్టమగుచున్నది.

'సూర్యదేవరవారు' పాల్గొన్న మఱియొక యుద్ధము చరిత్రగ్రంథములం దుల్లేఖించబడి యున్నది. ఈ యుద్ధము కమ్మవారగు చింతపల్లి ప్రభువు వాసిరెడ్డి నరసభూపాలునికి పాతూరు పట్టణపు ( ఇప్పటి పేరు నరసరావుపేట ) రాజు వెలమవారగు 'మల్రాజు సూరభూపాలుని'కి మధ్య క్రీ. శ. 1747 ప్రభవ సంవత్సరములో జరిగెను. వెలమవంశ సంభూతుండైన 'పానగంటి శేషయ్య' నరసభూపాలుని కొలువులో నాయనను ధిక్కరించి మాటాడినందున బయటకు వెడలగొట్టించిరి. శేషయ్య దుర్బోధలు చేయుటలో, కొండెములు చెప్పుటలో బేర్గాంచినవాడు. ఈయన మల్రాజు సూరభూపాలుని సంస్థానము

26. W. Francis — Vizagpatam District Manual P 245

ప్రవేశించి వాసిరెడ్డి సంస్థానమున తనకుజరిగిన యవమానమును జెప్పుకొనెను.. క్రీ. శ. 1715 వ సంవత్సరములో అనగా జయ సంవత్సరములో 'వాసిరెడ్డి చంద్రమౌళి నాయనికి' 'మల్రాజు పెదసూరన్న' వినుకొండసీమలో నాల్గవభాగము, నందిపాటి ఫిర్కా గ్రామములు, కొంత ద్రవ్యము ఋణముగా గైకొని అదవగా నుంచెను. నాల్గుపండ్లు ఆగిన ఋణమివ్వనందున, ఋణదాత ఒత్తిడి అధికమగుటచేతను, పెదసూరన్నపాలుడు నందిపాటి గ్రామములు విక్రయము చేసెను. ఈ ప్రకారము కొన్న క్రయము దాఖలాలున్నవి. ఈ విషయములో 'వాసిరెడ్డి వారికి మల్రాజువారికి కలహము జరుగుచుండెను. ఈ సమయమును పురస్కరించుకొని త్రాచుపాము పగబట్టిన 'పానుగంటి శేషయ్య', మల్రాజువారి గ్రామములను వాసిరెడ్డి వారు అక్రమముగా గైకొనిరని దుర్బోధలుచేసి, వారిని యుద్ధమునకు ప్రేరేపించెను.

అంతట కమ్మవారు, 'వాసిరెడ్డి నరసరాజు' లేఖలు జూచుకొని ఇరువదివేల దండుతో గజతురంగములతో యుద్ధమునకు తయారైరి. వెలమవారు చింతపల్లికి నైరుతిమూలగల 'మేదరసాల' దుర్గమువద్ద 17500 కాల్బలముతో 4000 గుఱ్ఱములతో 200 ఏనుగులతో సిద్ధపడిరి. 'నరసరాజు' తమ్ముడు 'చినరామలింగభూపతి' సంధికి ప్రయత్నించెను, కాని విఫల మనోరథుడాయెను. రామచంద్రరావు, రామారావు, పానుగంటి శేషయ్య మున్నగు వెలమదొరలు మల్రాజువారి సేనానాయకులు. చినరామలింగన్న, దేవరకోట ప్రభువు కోదండరామన్న సూర్యదేవర సంజీవరాయడు మున్నగువారు వాసిరెడ్డివారి

సేనానాయకులు. మూడు దినములు యుద్ధము జరిగినతర్వాత వెలమదొర లనేకులు రణరంగమున మడియుటచేత వారు నిరుత్సాహులై నాల్గవదినమున, అచటికి 12 మైళ్ల దూరంబునగల 'భీరవల్లిపాయ' యను నామంబుగల గ్రామంబులో ప్రవేశించిరి. దీనికిచుట్టు వలయాకారంబుగా నొక కొండ గలదు. ఉత్తరదిశలో పదిగజములవెడల్పుగల మార్గమొక్కటే కలదు. ఈ యిరుకు సందులో నుభయసైన్యంబులకు భయంకరమైన యుద్ధము జరిగెను. శత్రుసైన్యాధిపతి 'సూర్యదేవర సంజీవరాయణింగారు' చూపినపౌరుషప్రతాపములు శ్లాఘించదగినవి. చివరకు ఉభయ సైన్యములలో వేలకొలది వీరులు మరణించిన తర్వాత వాసిరెడ్డి వారికి జయముగలిగెనని 'కమ్మవీరులవిజయము' వాసిరెడ్డి వంశ చరిత్రము, దెల్పుచున్నవి. మెకంజీకూడ ఈ యుద్ధమును వర్ణించుటచేత ఇదిచరిత్రప్రసిద్ధిగాంచిన యుద్ధమనుటలో సందియములేదు. 'పొట్లపాడుకైఫీయతు'లో 357 వ పుటలో (L. R. 56) ఈయుద్ధము వర్ణించబడినది. వాసిరెడ్డి పద్మనాభము గారికిచ్చిన 13 గ్రామముల విషయములో నీ తగాదా వచ్చెనని మల్రాజు సూరన్నరాజు కేతవరం మాలపల్లెలు పుచ్చుకోవలెనని, బెల్లంకొండకు తూర్పునఉన్న 'నాగవరము' వద్ద మకాము వేసెనని, వాసిరెడ్డి చిననరసన్నతో జయించలేక 'పీరపల్లి పాయ'కు పారిపోయెనని, చిననరసన్నగారు ప్రబలుడైనందున యుద్ధములో మల్రాజు సూరన్నగారిని శిరచ్ఛేదన చేసి, తిరిగి తమ పాళెంపట్టు అయిన చింతపల్లికి వచ్చినారని యిందు లిఖించ బడినది. తరువాత సూరభూపాలుని కుమారుడగు నరసారావు నకు పట్టంబు గట్టుటచేత, ఈయనపేరుతో పాతూరు పట్టణ

ముకు నరసారావుపేట యని పేరువచ్చినది. 'అమరవాది రామన' కవి, తాను రచించిన 'వాసిరెడ్డీయము'లో కూడ వాసిరెడ్డి సూరయ కుమారుల చిననరసన్న చినరామలింగముల వర్ణించుచు ఈయుద్ధము నీక్రింది పద్యముతో వర్ణించినారు.

సీ. అమ్మనెమ్మహం వీరు డాత్మీయ పూర్వభూ
వరులచే మలరాజువారి యొద్ద
విలువ కార్జించిన వినుకొండ పాతిక
వంటూళ్ళు నాత్మ దౌర్బల్యకాల
మందు తద్వంశీయుడగు సూరయ క్షితీ
శ్వరు డాక్రమింప నిస్సైన్యుడయ్యు
నీతికోవిదుడౌట నిజ కమ్మ జాతికి
జాత్యభిమానం బెసంగ జాబు
లంపి యాత్మీయవర్ణసైన్యంబు గూర్చి
కొని యరిగి 'బీరవెలిపాయ' నని విరోధి
సైన్యము జయించి నైజరాష్ట్రంబు వశ మొ
నర్చుకొనియె యశం బుర్వి నాటుకొనగ.

ఈయుద్ధములో పాల్గొన్న కమ్మవీరులు కంతేరు, తుమ్మపూడి, శేకూరు, మోరంపూడి మొదలగు గ్రామములవారని, మొదట వెలమబాలుడగు 'రామారావు' కోపాగ్నిలో కమ్మవారు మిడుతలవలె మ్రగ్గిపోయిరని, కొందరు పారిడిరని, చినరామ లింగనృపుడు వెనుకకు మళ్ళినవారిని గొంతులు కోసెదనని కత్తినిఝుళిపించుచుండెనని చివరకు కమ్మవారికే జయము గల్గెనని 'కమ్మవీరులవిజయము' తెల్పుచున్నది.

ఈ రణరంగమున ననేకమంది 'సూర్యదేవరవీరులు అసువుల బాసిరనుటలో సందియము లేదు. మిగిలినవారు జయలక్ష్మిని గైకొనివచ్చిరి.

'అమరవాది రామనకవి' తన 'ద్రౌపదీపరిణయము'లో గూడ 'వాసిరెడ్డి సూరయ' నందనులగు చిననరసన్న, చిన రామలింగముల వర్ణించుచు, చిననరసన్న, వెలమవారగు 'మల్రాజు సూరన శిరచ్ఛేదనము చేసి, వ్రేలాడగట్టించెనని కవి ఈక్రింది పద్యములో వర్ణించియున్నారు.

ఘనమాద్యన్మతి నాత్మరాజ్యవుపహ్రుతిన్ గావించుమల్రాజు సూ
రన శీర్షంబు వధించి ఘోరరణగోత్రన్ వ్రేలఁగట్టించెఁ బెం
పెనయన్ దద్గ్రిహిళాత్మసీమఁ దిరుగా నేమన్నెహంవీరుడా
నన సాధించె నతండు చిన్నరసత్మాధీశ్వరుం డల్పుడే.

కం. ఆ చిననరసన తమ్ముఁడు
వాచాద్రుహిణుండు దర్పవత్పరిపంథి
త్మాచలభిజ్జలరణకే
ళీచణుడై చిన్నరామలింగన వెలసెన్.

ఇట్టీయుద్ధము చారిత్రక ప్రసిద్ధి గాంచియున్నది.

పులివర్తిసీమకు మండలాధీశులుగానున్న కాలములోను (క్రీ. శ. 1450—1580) చౌదర్లుగానున్న 120 ఏండ్ల కాలములోను (క్రీ. శ. 1580–1700) వీరు ఏ చరిత్రకారుని లేక కవిని ఆదరించి ఉండకపోవుటచేత వీరికాలమున 'రాయవాచకము' వంటి చారిత్రక గ్రంథములు కాన్పించకున్నవి.

ఏ కవినైన ఆదరించి యున్నచో, ఆయన తన కావ్యావతారికలో 'సూర్యదేవరవీరుల ప్రస్తావననుగూర్చి వ్రాసి యుండెడివాడే. 'సూర్యదేవరవారు కృతినందిన మొదటి చరిత్ర యిదియే యైయున్నది. ఈ చరిత్రతో బాటు వీరి కీర్తి ఆచంద్ర తారార్కముగా నిల్చును.

సూర్యదేవరవారు అనేక సత్కార్యములు అనగా బ్రాహ్మణుల గృహములలో వడుగులు, పెండ్లిండ్లు, బావులు దేవతారాధనములు, చెరువులు, తోటలు, సత్కృతులు, సప్త సంతానములు, భూదానము వీనియందు అభిమానము గల వారని, భట్టకవి, విద్వాంసులకు గొలుసులు, సాలువులు, మాన్యములు మున్నగు బహుమతు లిచ్చెడివారని, చాటు పద్యములు దెల్పుచున్నవి. కాని వీరు కృతినందిన గ్రంథ మొక్కటియేని లభ్యము కాలేదు. భావికాల పరిశోధనలలో నైన బయల్పడునేమో!

౬

## సూర్యదేవరవారు 'ఒరయూరు'నుండి వచ్చుట

సూర్యదేవరవారు తెలుగు చోడశాఖీయులని, 'విప్పర్ల' గోత్రమునకు జెందినవారని తెలియుచున్నది. సత్తెనపల్లి తాలూకాలో 'విప్పర్ల' గ్రామము గలదని అందు సూర్యదేవరవారి కోటగలదని అది నేడు శిథిలమైనదని, వీరి వంశములో నాఖరువాడు సూర్యదేవర అచ్చయ్య యని విప్పర్ల గ్రామ వాసియగు శ్రీ కొండవీటి వేంకటకవిగారి వలన తెలియు

చున్నది. ఈ గ్రామమునకు ఈ గోత్రమునకేదో సంబంధ ముండవలెను. అయ్యవార్లొసగిన వంశ వృక్షమును బట్టి వీరు 'జాలు' నుండి వచ్చిరని తెలియుచున్నది. కమ్మచరిత్ర లేఖకుడు యిట్లు వ్రాసెను. "వీరు మొదట తంజావూరు ప్రాంతమున నుండిరనియు నచట వెలమవారికి వీరికి తగాదాలు వచ్చినపుడు వెలమవారి ముక్కులు గోసిరనియు నచట చెప్పు చుందురు ఈ సూర్యదేవరవారి వంశవృక్షమొకటి ప్రాచీన మైనది వారి గురువులకడ లభించినది. దానినిబట్టి చూడగా సూర్యదేవరవారి మూలపురుషుడు రా మా నా యు డ ను నతడనియు, నాతడు 'జాలు' అను ప్రదేశమున పాలకుడుగా నున్నట్లును గన్పడును. ఈ ప్రదేశము గుర్తింపబడలేదు. కాని తంజావూరు ప్రాంతముదేయై యుండవచ్చును.[27]

చాటు పద్యములను బట్టి చూడగా అనగా 'ఎఱ్ఱయ'ను గూర్చి వ్రాసిన పద్యములలో సూర్యదేవరవారు ఒరయూరు పురవరాధీశ్వరులని స్పష్టపడుచున్నది.

గీ. ఔర! విప్పర్లగోత్ర ఖాహాభిరామ
లాలితంబుగఁ బలియతలాటరాయ
యనుచు నిన్నును భాషింతు రర్థివరులు
పటువచోరాఢి నఖిల భూపాల సభల
భూరి గుణహార! యొరయూరి పురవిహార
భళిర సూర్యదేవర తిమ్మప్రభునిఎఱ్ఱ!

27. కొత్త భావయ్య చౌదరి — కమ్మవారి చరిత్ర, భా 2, 3.

గీ. అనుచు విన్నను భాషింతు రర్థివరులు
పటువచోరాశి నఖిల భూపాలసభల
భూరిగుణహార యొరయూరిపురవిహార
భళిర సూర్యదేవర తిమ్మప్రభుని ఎట్టి!

ఈ ఒరయూరు, కావేరినది ఒడ్డున ఉన్నది. 'కుమార సంభవ కర్త' నన్నెచోడుడు కూడ, తాను 'ఒరయూరి' కధిపతి నని పేర్కొనుచున్నారు.

క. కలుపొన్న విరుల చెరుగన్
గలు కోడిరవము దిశలఁగలయఁగ చెలఁగన్
బొలుచు నొరయూరి కధిపతి
నలఘు పరాక్రముడఁ డెంకణాదిత్యుండన్. 1-54

తెలుగు చోడులెల్లరు తాము ఒరయూరి కధిపతులమని, కరికాలచోళుని వంశీకులమని, సూర్యవంశీయులమని చెప్పుకొనుచుండిరి. సూర్యదేవరవారిని గూర్చి వ్రాసిన చాటువులలోగూడ నట్లే ఉండుటచేత, వీరును, నన్నెచోడుడు మున్నగు తెలుగు చోడులు, కరికాలచోళుడు, మున్నగువారు అందరు ఒకేవంశమునకు జెందినవారని, ఒరయూరి ప్రాంతమునుండి వచ్చినవారని ఊహగల్గుచున్నది. నెల్లూరుజిల్లాలో మరియొక 'ఒరయూరు' కలదేమో ఆలోచించవలయును. నిడదవోలు వెంకట్రావుగారు "ఇది దక్షిణదేశమున ప్రసిద్ధమైన 'ఒరయూరు'గాక తెలుగు దేశమున నున్నది." అని తన 'తెలుగుకవుల చరిత్ర'లో వ్రాసినారు. (పుట199). మధ్యలో నెల్లూరుజిల్లాలో వీరు ఆగిరేమో

యని తెలుగు చోడులతో గలసియుండిరేమో యని నెల్లూరు జిల్లా మాన్యుయల్, శాసనములు పరిశోధించితిని. కాని అట్టి విషయములు లభ్యము కాలేదు. కాని అయ్యవార్లంగారు, సూర్యదేవరవారు మధ్యలో కర్ణాటకరాజ్యములో నాగి, పిమ్మట గండికోటలోనుండి, తరువాత రాచూరుకు, జేరిరని వచించుచున్నారు. ఇది క్రీ.శ.1400 సంవత్సర ప్రాంతమున జరిగెను. మధురరాజ్యమును బరిపాలించిన 'తిరుమల నాయక్'తో వీరికి సంబంధ బాంధవ్యములుగలవని వదంతికలదు. కాని దీనిని ధ్రువపరచుటకు యితర చారిత్రకాధారములు నాకు కన్పించలేదు. ఈ మధురనాయకరాజులు కమ్మవారై ఉండవచ్చును. తెలుగు భాషాపోషణచేసిన ముగ్గురుమధురరాజులలో 'తిరుమలనాయక్' 'ముద్దలగాద్రి' 'విజయరంగచొక్కభూపతి' అను వారిలో 'తిరుమలనాయక్' ముఖ్యుడు.

(H. KrishnaSastry " that of the Madura Nayaks Thirumala, Muddala Gadri and Vijayaranga Chokka Nadha were patrons of Telugu Literature.")

ఈయన క్రీ.శ. 1623–1659 వరకు గాన్పించుచున్నాడు. ఈయన తన రాజధానీ నగరమును 'తిరుచినాపల్లి' నుండి మధురకు మార్చినాడు. పాండ్యులకుకూడ రాజధాని మొదట కొర్కై, తర్వాత మధురకు మార్చబడినది.

చోళరాజులకు రాజధాని నగరము మొదట 'పుహార్' లేక 'పుగార్' అని తెలియుచున్నది. ఇది 'కావేరీ పట్టణము' అని ఆధునిక విద్వాంసులు కనుగొనినారు. క్రీ. శ. రెండవ

శతాబ్దములో నీనగరము ఊడ్చుకొనిపోయెను. తర్వాత 'తంజావూరు' కొన్నాళ్ళు రాజధానీ నగరముగా నుండెను. ట్రిచినాపల్లి దగ్గరనున్న 'ఉరయూరు' వారి ముఖ్యనగరములలో నొకటి."[28] తిరుచ్చి రాప్పల్లి యని 'పెరియపురాణములో' ట్రిచినాపల్లి పేర్కొనబడినది.

ప్రాచీన చోళులలో క్రీ. శ. 125-150 వరకు పాలన చేసినవాడు 'పెరునర్కిల్లి I'. ఈయన చేరరాజును సంహరించెను. రాజధానినగరము 'ఒరయూరు.' ఈయనకుమారుడు 'ఇల్లన్ జెట్ సెన్ని' కాని రాజ్యపాలన చేయలేదు. తరువాత కరికాలచోళుడు రాజ్యపాలన చేసెను. క్రీ.శ. 150 - 180) చేరరాజైన 'రెండవ ఆడన్‌తో' యుద్ధమాడి సింహళద్వీపము మీదకు దండెత్తి, లక్షమంది ఖైదీలను గైకొనివచ్చి కావేరీ నదికి ఆనకట్టకట్టించెను. ఈయన కాలములో 'ఒరయూరు' కోట ప్రఖ్యాతిగాంచియుండెను. వీరివారసులు చేరరాజుల ముఖ్యనగరమగు 'వంజి.'వరకు జయించి వచ్చిరి.

'పరాంతకుడను' రాజు ముఖ్యనగరముకూడ "కోరి"యని యిదియే 'తిరుచినాపల్లి' సమీపమునగల 'ఉరయూరు' అని'ఉద

---

28. Sewell ; Historic inscriptions of South-India

"The early kings ruled from 'PUHAR or PUGAR' now identified with 'KAVERIPATTANAM' on the East coast which was overwhelmed by a tidal wave in the second Century A. D. and late at Tanjore. URAYUR' near Trichinopally was one of their Principal cities."

యేందిరము తామ్రశాసనము' తెల్పుచున్నది.[29] దీనినిబట్టియే కాబోలు 'కాల్డ్వెల్' అనువిద్వాంసుడు 'ఒరయూరు' చోళుల ప్రాచీన రాజధానియని ఇదియే 'కోలి'యని, ఆధునిక ట్రిచినాపల్లియని వ్రాయుచున్నాడు. క్రీ. శ. 700 ప్రాంతమున పాలించిన 'ఉరయూరు'[30] రాజు 'అరికేసరి' కూడల్ (మధుర) వంజి, కోలి, (ఉరయూరు) కోటగోడలను తొలగించినట్లు చరిత్రాధారములవలన తెలియవచ్చుచున్నది.[31]

'రాజరాజచోళుడు' ట్రిచినాపల్లి ప్రాంతమున రాజ్యపాలనచేసినట్లు స్పష్టమైన ఆధారములుగలవు. 'తిరుకోట్టలూరు' శాసనమునుబట్టి (క్రీ. శ. 1222 – 23) 'మారవర్మాన్ సుందర పాండ్య I' అను పాండ్యరాజు తనరాజ్యపాలనాకాలము ఏడవ ఏట 'తంజావూరు, ఉరయూరు' నగరముల దగ్ధము చేసెనని

29. Ibid. page 43:—

" The 'UDAYENDIRAM COPPER PLATE grant says that, PARANTAKA's Capital was 'Koli', which is equal to 'URAYUR' near Trichinopally.'

30. BISHOP CALDWELL:— Dravidian comparative Grammar P. 13.

'This capital city in the earliest period was 'URIEYUR' (literally the city of habitation ) called also 'Kori' which appears to have been nearly identical with the modern Trichinopally–Tiricirappalli.

31. Ibid – P, 137. 'ARIKESARI' – 700 A. D.

He is said to have removed the walls of 'KUDAL' ( i. e. ) Madhura and of Vanji and Koli (URAYUR).

చోళరాజ్య విస్తరణ కాకుండ చేసెనని తెలియుచున్నది.[32] 'మార్కో-పోలో' ఈయన కాలములోనే వచ్చెను. ఈ 'సుందర పాండ్యుడు' చోళరాజ్యమును జయించెనని 'చిదంబరమున' కేగెనని, అచట మూడవరాజరాజచోళునికి తన సింహాసనము నొసగెనని తెలియుచున్నది.

ప్రాచీన చోళుల మొదట రాజధాని 'ఉరయూరు' అని దానికి 'కోరి' యను పేరు గలదని చరిత్రకారులు వ్రాసిరి. కొందరు కోలియని వ్రాసిరి.[33] ఈనగరము ధ్వంసమైన తర్వాత క్రీ. శ. 7వ శతాబ్దములో 'మాలై కుర్రముకు' మార్చబడెనని, అదియే కుంభకోణమని తర్వాత గంగైకొండపురమని, తరువాత

---

32. Ibid – P. 142.

" An inscription of the 7th year of 'Maravarman Sundara Pandya I states that he had burnt Tanjore and Urayur and prevented the Chola Kingdom; how he invaded Chola Territory, captured, and burnt Tanjore and Urayur, also see Arch. Report 1909 – 10 Page 153 ,The Pandya king who at this time was powerful in the Chola country was Maravarman Sundara Pandya–I (A. D. 1216 to 1235). Sundara I boasts of having burnt Tanjore and Urayur and prevented the Chola country.

33. SIR W. ELLIOT :- Coins of South India P. 130

" Their first capital was 'Urayur' (Warriors= the city of habitation called also 'Kori', (Caldwell Grammar Introduction page 17) the oldest part of the Modern Trichinopally.'

'తంజావూరు'కు మార్చబడెనని తెలియవచ్చుచున్నది.[34] ఈ విధముగా 'ఒరయూరు' తొల్లిటి ప్రాధాన్యతను గోల్పోయినది. తరువాత కాలములోని మధురనాయకరాజులు తమ సైన్యమును కచేరినికూడ క్రి. శ. 1616 లో 'తంజావూరు' రాజుతో యుద్ధముచేయవలెనను తలంపుతో 'తిరుచినాపల్లి'కి మార్చిరి.[35] 'ఉరయూరు' కోట నిల్చియున్నచో దీనికి మార్చియుండెడి వారేకాదు.

'లూయీ మూర్' రచించిన ట్రిచినాపల్లి మాన్యుయల్‌నుబట్టికూడ, 'టాలమీ' కాలములో చోళుల రాజధాని 'ఆరకాటు' అని తర్వాత 'ఉరయూరు' అని తర్వాత 'కుంభకోణము' అని, తర్వాత 'తంజావూరు' అని తెలిసికోవచ్చును[36].

---

34. Ibid – page 130 – "On the destruction of this place by some catastrophe (natural or Political) the capital was transferred about the 7th century to Malai Kurram' the modern 'Kumbhakonam', which still retains traces of its former celebrity – Seat of Government – Gangai Kondapur – Finally Tanjore."

35. Leou Busse – Page 103; R. Satyanadha Ayyar – History of Nayaks of Madhura,

36. Lewis Moore – Trichinopally P. 114:—

"The capitals of this kingdom it is said, were Arcot, in Ptolemy's time, then 'Urayur', then Kumbhakonam, and lastly Tanjore."

ఈ అరకాటు ఏదియో!

మొత్తముమీద 'ఒరయూరు' పూర్తిగా నామ మాత్రావశిష్టమై పోయి యిపుడు 'ట్రిచినాపల్లి' మునిసిపల్ సరిహద్దులలో చేర్చబడి, చిన్నఅంగడిని, రెండు దేవాలయము లను గల్గియున్నది. 'డాల్టన్ లారెన్సు' మున్నగు ఆంగ్ల సేనా నులు ముస్లిములపై దండయాత్రలు చేయునపుడు, 'లారెన్సు' అను ఆంగ్లసేనాని 'ఒరయూరు' దేవాలయములోనే తన మకాము వేసెను.[37] ఈయన క్రీ.శ. 1753 లో 'ట్రిచినాపల్లి'ని విముక్తిచేయుటకు సైన్యముతో బయలుదేరి యిచ్చట నిల్చె నని మరియొక విద్వాంసుడు వ్రాయుచున్నాడు. ఈ వ్రాతలు 'చారిత్రకసత్యములే.

చారిత్రక ప్రసిద్ధిగాంచిన ఈ గ్రామము నుండియే సూర్యదేవరవారు' బయలుదేరివచ్చి కొన్నాళ్ళకు 'కమ్మనాటి' లోని రాచూరు, పేటేరు, రేపల్లెప్రాంతములకు జేరి సామం తులుగా పాలించియుండవచ్చునని యూహగల్గుచున్నది.

## 8
## సూర్యదేవర శబ్దవిచారము

సూర్యదేవరవారు క్షత్రియవీరులు. "దక్షిణమున

37. Lewis Moore – Trichinopally District Manual P. 158 "Urayur was completely ruined P 167 "Lawrence took up his camp in the Pagoda in 'Urayur'.
38. C. Hayanatha Rao – History of Mysore.

నున్న పాండ్య, చోళనాయకులు, ఆదిలో ద్రవిడపాలిగార్లుగా నుండియుండవచ్చునని, కాలక్రమమున వీరు హెూదావలన, అధికారమువలన క్షత్రియబిరుదులగు 'దేవ, వర్మ' యను వానిని పొందిరని కాల్డ్వెల్ అను విద్వాంసుడు వ్రాయుచున్నాడు.[39] ఇది సరిగానే ఉన్నది ఈవిధముగా వీరికి చివర 'దేవ' లేక 'దేవర' యని యుండుటచేత వీరు ద్రావిడనాయకులై యుండిరని చెప్ప వచ్చును. క్రమముగా క్షత్రియులై రాజ్యపాలన చేసిరి. 'దేవర' శబ్దము వీరు క్షత్రియులని స్పష్టముచేయుచున్నది.

ఇక సూర్యశబ్దవిచారణ చేయుదము. 'సోర' యను శబ్దము తమిళజాతికి ఉత్తరమున నున్న భాగము అని తెలియ పరచును. ఆకాలపు తమిళవాఙ్మయమునుబట్టి చూడగా ఈ 'సోరుల' ముఖ్యనగరము 'ఉరయూరు' అని తెలియుచున్నది. కనుక 'సోరులను' సంస్కృతములో చోళులని, తెలుగులో కూడ చోళులని పిల్చెదరు 'సోరులు' సోరగలు, సోరీయులు,

---

39. Bishop Caldwell – Dravidian comparative Grammar Page 111 — "The gradual transformation of these semi barborous chieftains into Kshatriya princes shows how the Pandya and Chola Chieftains of the south may originally have been Dravidian Poligars (Paleiyakharan, the holder of a Paleiyam, a feudal estate) like those of Ramanadha and Pudukota in later times and may in process of time have risen in rank as in Power, – assuming (above) P. 112 "assuming as they did so the Kshatriya titles of Deva, Varma etc."

ఈ పదములన్ని 'చోళులు' అనుపదమునకే సరిపోవుచున్నవి. దీని ననేకమంది పరిశోధకు లంగీకరించిరి.[40] సూర్య, సోరియ శబ్దములు దగ్గరగానున్నవి. 'చోళ'శబ్దార్థములో గాని-చో, ఈవంశీకులు 'సూర్యోపాసకులైన క్షత్రియులని, లేక కరికాల చోళుని' వలె సూర్యవంశరాజులని చెప్పవచ్చును.

వీరుక్రమముగా సూర్య, చంద్ర, అగ్నికులవంశముల అభిరుచులను కృషిచేసిరని తెలియుచున్నది.[41] వీరియొక్క కుల బిరుదము 'దేవ' యని నేడు మారవాస్' అనువారికి కూడ నిదియే కలదని 'కాల్డ్వెల్' వ్రాయుచున్నాడు.[42]

వీని యన్నిటిని సమన్వయము చేయగా, సూర్యదేవర వారు మొదట చోళులని, కరికాలచోళ వంశజులని, ఒరయూరు తిరుచినాపల్లి ప్రాంతముల నుండిరని, రాజ్యపాలనచేత క్షత్రియు

40. Bishop caldwell-Dravidian Comparative grammar Page 92, 93.

"Sora - represents fhe name of the northern portion of the Tamilian nation - Tamil Sora - Soras, but as we know from native poems that the name of the ancient capital of the Soras was 'Uriyur' (Pronounced Urieyur) This name is 'Chola' in Sanskrit, Chola in Telugu Soras, Sorayas' Soriyas :-

41. Lewis Moore - Trichinopally Manual.

42. Bishop Caldwell P. 115. "It my appear worthy of remark that this caste title was Deva, the same as that of the Maravas at present."

నైరని, నన్నెచోడుడు మున్నగు తెలుగుచోడులకు గల బిరుదములు వీరికికూడ ఉండుటచేత, వీరు వారు ఒకేవంశమునకు జెందినవారని ఊహ గల్గుచున్నది. తొలుత వీరు ఆంధ్రదేశము నుండియే ఒరయూరుకు జేరిరేమో తెలియకున్నది.

## ౮

## సూర్యదేవరవారి బిరుదావళి – చాటుపద్యములు

చారిత్రక ప్రసిద్ధిగాంచిన సూర్యదేవర వారికి ఈ క్రింది బిరుదములు గలవని చాటువులవలన తెలియుచున్నది. వీని నన్నిటి నొకచోట కమ్మచరిత్రకారులు పేర్కొనినారు.[43] "ఒరయూరిపురవిహార, ఒరయూరి శ్రీపాద పద్మారాధక, ఉద్దండపులియతలాటరాయ, గండభేరుండ, పులియమార్కోలు గండ, గండరగండ, కరవాలభైరవ, మహిమతోఘోడికరవాల భైరవ, రాజీవచూఅకార, కదనప్రసంగ" అను బిరుదములు గలవు. "వీరికి వెండికోరతాంబూలము, పమిడికోరశాసయు, కనకదండ అందలము, హనుమంతుని ధ్వజమును" గల్గియుండు మర్యాద యుండెను. ఇంకను "నడుమనీ పెక్కండ్రు నాయకుల నక్కెత్తుర గండ, మహిమతో ఘోడికరవాల భైరవ, దుష్ట గోప గోగులమారి మర్దన, దర్పితారాతి ధూమకేతి, కటకహి నిబ్బరదండ సప్తద్రితివిశూరకార కదన ప్రసంగ, హితహేతి" మున్నగు బిరుదములుగలవు. పెమ్మసాని తిమ్మానాయనికికూడ

43. కొత్త భావయ్య చౌదరి – కమ్మవారి చరిత్ర. ద్వితీయభాగము పుట 251, 252.
సూర్యదేవర రాఘవయ్య చౌదరి – కమ్మవారి చరిత్ర. పుట I –

'మన్నెమార్తాండ, గండరాదిత్య గండరగండ" యను బిరుద ములు గలవని ఐతిహాసిక లేఖకులు వ్రాయుచున్నారు.

కీ. శే. సూర్యదేవర రాఘవయ్యచౌదరిగారు "చాటుపద్య రత్నాకరము, చాటుపద్యమణిమంజరి, కైఫీయతులు మున్నగు వానిలో గల కమ్మవారికి సంబంధించిన చాటుపద్యములన్ని ఒకచోటికిజేర్చి, 'కమ్మవారి చాటుపద్య రత్నావళి' అను పేరుతో గ్రంథమువ్రాసి ముద్రించినారు. అందుండి ఈ పద్య ములు గైకొనబడినవి.

# సూర్యదేవరవారినిగూర్చిన చాటుపద్యములు

## లక్ష్మయామాత్యుఁడు

( సీసమాలిక )

శ్రీ జయలక్ష్మికి స్థిరతరవాసమా
వర సూర్యదేవర వారియిల్లు
పులివర్తి సీమకు భూపతిత్వముఁ బొంది
శత్రురాజులచేత శరణుఁగాంచు
గురుతర విప్రర్ల గోత్రాబ్ధిచంద్రులా
మీదు పూర్వికులు భూమీతలమునఁ
బేటకు రాచూరుకోటలు గట్టించి
మేటివదాన్యులై మించినారు
త్వద్వంశమందునఁదగ తపోమహిమచే
రఘువయ్య యననొప్పు రమ్యగుణుఁడు

మన్మథ సమరూప మహితుఁడు విద్యల
భోజుఁడు విభవ బిడౌజుఁడెసఁగు
నామహామహు గర్భమందు జన్మించిరి
శౌర్యవంతులు మహాసైన్యపతులు
పరికింపఁ బట్టయ్య బహురణశూరుఁడై
దేవతాభక్తితోఁదేజరిల్లె
శారద నారద చంద్రికాధవళాబ్జ
డిండీరములఁ బురుడించునట్టి
పాండు సత్కీర్తిచే భాసిల్లు లక్ష్మయ్య
పండితస్తుత్యుఁడై వఱలెభువిని
లక్ష్మయ్య కొమరులు రసికశిఖామణుల్
ముగ్గురు గల్గిరి మోదమలర
నరహరిపదభక్తి నయగుణశీలుండు
నరసన్న శరకీర్తి స్ఫురితమూర్తి
శంకరపదపద్మ సంసేవనపరుండు
వెంకన్న సమర నిశ్శంకబుద్ధి
రామస్వామియు మహారసిక శిఖామణి
సుగుణగణమ్ముచే సొంపుమీరు
వైష్ణవసేవనావార్ధిశశాంకుండు
సకలవిద్వజ్జన సన్నుతుండు
పరమభాగవతైక భక్తిలోలుండు న
ష్టాక్షరీమంత్రి జపానుసారి

సురరాజవిభవుండు శరధిగంభీరుండు
వెంకయ్యబుద్ధికి పంకజజుఁడు
అతనికి గల్గిరి యష్టసూనులు నయ
పరులు గుణాఢ్యులు భవ్యయశులు
తాత.........పరిఖ్యాతిచేఁ దనరారి
కవులకుఁ గల్ప వృక్షమ్ము రీతి
ఘనతఁగాంచె రఘయ్య యని మహారమ్యాఖ్యఁ
బరఁగి భటస్తుతిఁ బరిబలె భువిని
బాంధవాబ్ధి కుముద బాంధవుం డనవచ్చు
గురుభక్తియుక్తిచే గుండరాయఁ
డతులగుణోదారుఁడై యొప్పు నాగయ్య
అక్కయ్య యెన్న బల్ రిక్కఱేఁడు
అర్థులకిష్టాన్న మాదరంబున నిచ్చుఁ
గృష్ణరాయఁడు పరితుష్టిగాను
భూసురస్తుత్యులు పున్నయ్య హనుమయ్య
రామానుజయ్యయుఁ బేరిమమీఱ
అలబలేందుని భాను యాత్మజుం డనవచ్చు
చలిమలఁ బురుడించు చలమయాఖ్యుఁ
డిర్వురియందున సర్వజ్ఞసమమూర్తి
నరసన్న దీనమందారుఁ డెన్నఁ
గోటయ్య వరహాలమూట కవీంద్రుల
పటుతరాశీర్వాద పాత్రుఁడయ్యె

సురుచిర చరితుండుసూరివర్యుండగు
సుబ్బయ్య నెన్నఁగానిబ్బరుండు
అతనికి సత్పుత్రుఁడాహవభీముండు
వినయవిధేయుండు హనుమయాఖ్యుఁ
డలరామయాఖ్యుల త్యంతరాట్కృతి ధురా
బహుభోగభాగ్య సంపదలఁదనరు
కవికష్టములదీర్చు కరుణచే కృష్ణయ్య
లక్షుమయ్య కవుల రక్షకుండు
కోటయ్య నాగయ్య మేటివదాన్యులై
బహుభక్తి యుక్తిచేఁబ్రబలినారు
యుక్తిచే విష్ణు సద్భక్తిచే ధర్మాను
రక్తిచే బుచ్చయ్య ప్రణుతిఁగాంచె
నతనికి బ్రియసుతు లతిగుణశీలురు
గలరు సౌందర్య నిస్తులురు దలప
మెచ్చి సత్కవులకునిచ్చి వెయ్యారులు
పిచ్చయ్య గడియించెవిపులకీర్తి
రసికుఁడు సుబ్బన్నరామకృష్ణమ్మయు
మాటాడి తప్పని మానఘనులు
విమల పారంపర్య వృద్ధిచే నెల్లరు
గండరగండ లుద్దండబలులు
మాళవ నేపాళమత్స్య చోళ విదేహ
కుకుర వైదర్భాంగ కోంకణాఖ్య

దేశాధిపతులెల్ల వ్యా............
సూటిదప్పని బంధుకోటి పొగడ
విశదంబుగను గృష్ణవేణి తీరంబున
ముద మొప్ప కొల్లూరు పురవరంబు
ఆపట్టణమునకు నధ్యక్షులైయుండి
రఖిలసత్కార్యంబు లరసికొనుచు
బ్రాహ్మణగృహములు వడుగులు పెండ్లిండ్లు
బావులు దేవతా భవనములను
జెఱువులుఁ దోటలు స్థిరముగా సత్కృతుల్
సప్తసంతానముల్ సంగ్రహించి
సరిపనగొలుసులు సాలువుల్ మాన్యమ్ము
లాందోళికలు వీజనాళి హారులు
పోగులుంగ్రాలాది భూషలెన్నెన్నియో-
భట కవిజనులకు బహుమతులుగ

గీ॥ నిచ్చి విలసిల్లి తౌరౌర యిందుకీర్తి!
భళిర రఘువయ్య గర్భసంభవ మహారాజ!
లక్ష్మయాఖ్యలలామ! ప్రోల్లసితధామ!
ధరణి వర్ధిల్లు మాచంద్రతారకముగ.

సీ॥ శ్రీమించు కొల్లూరు క్షేమంబునొందంగ
బాలింపుచున్న సత్ప్రభుఁడవీవు
భూసురావళినెల్లఁబోషింపఁగాఁబూని
భూదానమిచ్చు సత్పుణ్యుఁడీవు

దేవతారాధనల్ గావించి నిరతంబు
పాలింపుచున్న సత్ప్రభుఁడవీవు
ఆరామ కూప దేవాలయాదుల నిల్పి
పాలించుచున్న సత్ప్రభుఁడవీవు

గీ॥ అరయ నీసుగుణము లెన్న నజునితరమె
యార్యగుణభూష! పరమ భక్తానుమోద
సూర్యదేవరవంశజ! సూర్యతేజ!
లక్ష్మణాఖ్యలలామ! ప్రోల్లసితనామ!

సీ॥ గ్రామాధికారంబు సామాన్యులకు నౌనె
ప్రభుఁడు మెచ్చుచును క్యారట్ల నిచ్చె
మోదమందఁగ మహా మృదుభాషణాలు మీకు
వాదించి మెచ్చి యవ్వాణి యిచ్చె
సౌఖ్యసంపత్తియుఁ జాలఁగా మును మీకు
హృదియందు మెచ్చి యయ్యీశుఁడిచ్చె
పూతబుద్ధియు రత్నభూషణంబులు సదా
ఫణిరాజు నీకు నేర్పలచియిచ్చెఁ

గీ॥ గాన ఘనముగ నర్థులఁగాచితీవు
సరసగుణశీల నవ్యబుధ స్థానపాల
సూర్యదేవర వంశజ! సూర్యతేజ!
లక్ష్మణాఖ్యలలామ! ప్రోల్లసితనామ!

సీ॥ మీరీతి మీనీతి మీనేర్పు మీ యోర్పు
వర్ణింపఁ దరమె యొ-వ్వారికైన

మీశీవి మీయీవి మీపల్కు మీకుల్కు
వర్ణింపదరమె యెవ్వారికైన
మీభక్తి మీశక్తి మీయుక్తి మీ రక్తి
వర్ణింపఁదరమె యెవ్వారికైన
మీచూపు మీరూపు మీప్రాపు మీ కాపు
వర్ణింపఁదరమె యెవ్వారికైన
గీ॥ నెంతవారికినైన వర్ణింపఁదరమె ?
మిమ్మువర్ణించి మీవంశ మెన్నవలయు
సూర్యదేవరవంశజ! సూర్యతేజ!
లక్ష్మణాఖ్యలలామ! ప్రోల్లసితనామ !

## వెంకయ్య

సీ॥ శ్రీరమేశునిపాద సేవాధురీణుండు
సకల విద్వజ్జ నసన్నుతుండు
భూసుర భట కవి పోషణశీలుండు
బాంధవపంకజ భాస్కరుండు
పద్మాక్షు పదపద్మ భాసుర మకరంద
పాన మమర సు స్వాంతయుతుఁడు
మందార చందన మల్లికా కర్పూర
పాండుర సుస్థిర భవ్యయశుఁడు
గీ॥ సాగరసుధీర సమర నిశ్శంకవీర
వరగుణచరిత్ర! రఘువయ్య వరసుపుత్ర
సూర్యదేవరచంద్ర! సు శ్లోకసాంద్ర!
నవ్యగుణగేయ! వెంకయ నామధేయ!

## చలమయ్య

సీ॥ క్షీరసాగరమందు క్షీరాబ్ధితనయుండు
పదునాఱుకళలచేఁ బ్రబలినట్లు
పాకారివనమందు భాసిల్లు సంతాన
భూజ మిష్టదమౌచుఁ బొడమినట్లు
సప్తాశ్వకులమున సత్యహరిశ్చంద్రుఁ
డల ప్రతిజ్ఞావధి నందినట్లు
విప్రకులంబున వితరణగుణుఁడు రా
యని భాస్కరామాత్యుఁ డలరినట్లు
గీ॥ వఱలు శ్రీసూర్యదేవరా న్వయమునందు
మించి వెలసితి వౌరౌర యంచితముగ
రమ్యగుణ రఘునాయక రసికతనయ
సరసగుణసాంద్ర! చలమయ సాహసేంద్ర!

## ఎఱ్ఱయ ప్రభుఁడు

సీ॥ కూళతనముమాని కొలువుఁగొల్చినఁగాని
కావఁడే విప్రుల్ల ఘనుఁడితండు
మదగర్వములుమాని మఱుఁగుఁజొచ్చినగాని
కావఁడే విప్రుల్ల ఘనుఁడితండు
తగఁగొంటెతనమఱి దండమిడినఁగాని
కావఁడే విప్రుల్ల ఘనుఁడితండు
పోతరంబులుమాని పూరిమేసినఁగాని
కావఁడే విప్రుల్ల ఘనుఁడితండు

గీ॥ ఔర విప్పర్లగోత్ర! బాహాభిరామ!
లాలితంబుగ పులియత లాటరాయ
యనుచు నిన్నును భాషింతు రర్థివరులు
పటువచోరూఢి నఖిల భూపాలసభల
భూరిగుణహార! మొరయూరి పురవిహార!
భళిర సూర్యదేవర తిమ్మ ప్రభునియెఱ్ఱ!

సీ॥ కల్పాంతరస్థాయి గండభేరుండాంక!
పటుఖరకరవాల భైరవాంక!
కుశలంబు విప్పర్ల గోత్రాబ్ధిహిమధామ!
శ్రీలందు పులియ మా రోకలుగండ!
వినుత సత్కీర్తిచే వెలయు గండరగండ!
శుభమస్తు రాజీవ చూఱకార!
కొమరొప్పనభిమాన ఘోటియబిరుదాంక!
లాలితపులియత లాటరాయ!

గీ॥ అనుచు నిన్నును భాషింతు రర్థివరులు
పటువచోరూఢి నఖిల భూపాలసభల
భూరిగుణహార! మొరయూరి పురవిహార!
భళిర సూర్యదేవర తిమ్మ ప్రభునియెఱ్ఱ!

**ముసలయనాయకుఁడు**

సీ॥ గండరగండ నీఘనతురంగము నెక్కి
ఆరట్లకోట పోరాడునాఁడు
కరవాలభైరవకైవాలు ఝళిపింప
భీతిని పగతురు బెదరిచనిరి

పులియతలాటాంక జెలఁగిబల్లెంబెత్త
శరణంచు రిపులు హస్తమ్ములెత్త
విప్పర్లసింహంబు విల్లుచేబూనిన
నరివర్గములగుండె లదరుచుండు
గీ॥ నేర్చినారలో కాకున్న నిన్నుఁగదిసి
భుజసమగ్రిత నెదిరించి పోరఁదరమె?
ప్రథననిశ్శంక! సూర్యదేవరశశాంక!
తిమ్మభూపాల సత్పుత్ర ధీపవిత్ర!
నయగుణోపేంద్ర! ముసలయ నాయకేంద్ర!

సీ॥ సింహంబు బెడిదంపు రంహంబుమై వచ్చి
గంధసింధురముపైఁగదిసినట్లు
నిబ్బరంబుగ గబ్బి గుబ్బిలి బెబ్బులి
యుబ్బుచు లేళ్లపై కుఱికినట్లు
నాలుకల్గోరియు పన్నగముఖ్యమును గాంచి
ధరకు గరుత్మంతుఁడుఱికినట్లు

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

గీ॥ కొట్టి రిపుకోట్ల నుగ్గాడి పెట్టితౌరా!
ప్రధన నిశ్శంక! సూర్యదేవరశశాంక!
తిమ్మభూపాల సత్పుత్ర! ధీపవిత్ర!
నయగుణోపేంద్ర! ముసలయ నాయకేంద్ర!

## నారసింహుఁడు

సీ॥ నీమహామహిమంబు నెరమన్నెలును మెచ్చ
బంధువుల్ పెంపుగాఁబ్రస్తుతింప

శవితార్యజనులెల్ల గడఁగి వర్ణింపఁగా
కార్యదక్షులు నీదు ఘనతనెన్న
దేశాధిపతులెల్ల దీర్ఘరివనియెంచ
సరి జమీానులు నిన్ను సన్నుతింప

..............................................

......ధైర్యస్ఫూర్తి చెంగలింప

గీ॥ నీవె దొరవయ్య యిప్పటి నేర్పరులకు
సూర్యదేవర వంశాబ్ధి సోమ విమల
నామ! వేంకటరాయ కోద్దామభీమ
నారసింహావనీంద్ర! శ్రీ నయవిశాల !

క॥ సూదేవర నరసింహుని
పాదపరాగంబు లోభి పాపాత్ములకున్
మేదురత బొట్టుఁబెట్టిన
వేదాంత రహస్యమైన వితరణమబ్బున్.

—o—

౮

# సూర్యదేవర వంశవృక్షము.




తిమ్మనీడు కాలమున గురువగు '(శ్రీ) రంగరాజభట్టారు, వచ్చెనని, అయ్యవార్లంగారు చెప్పిరి కాని ఆ కాలము క్రీ. శ. 1633 అగుచున్నది. కనుక అది సరికాదు. ఈ వంశములోని వారే ఈ కృతిభర్త 'సూర్యదేవర నరసయ్యగారు.'

## కృతి భర్త



శ్రీ సూర్యదేవర నరసయ్య

# కృతిభర్త ద్వితీయ కళత్రము



కీ. శే. విశాలాక్షమ్మ,

(మరణము: చిత్రభాను, అధిక జ్యేష్ఠ శు 3 లు సోమవారం)

భాగ్య గర్వములేకుండ పరిజనులతో కలసిమెలసి వారి ఆకలిబాధలకు అంబలిసత్రము లేర్పరచి అన్నపూర్ణ యని పేర్గాంచిన, ధర్మార్థమై నగము అస్తిని వినియోగించుడని నిత్య సత్య త్యాగశీలని ప్రియునికి బోధించిన, తన సమయస్ఫూర్తి, తెలివి తేటలతో నొకతరి భర్తకురానున్న ప్రాణోపద్రవమును గ్రహించి రక్షించిన, పతియొక్క ఘనతకు కారణభూతురాలు, అమరజీవి యైన మానినీరత్నము.

# కృతిభర్త సూర్యదేవర నరసయ్యగారి జీవితచరిత్ర.

## 1. బాల్యము

నరసయ్యగారు క్రీ.శ. 1892 వ సంవత్సరము నవంబరు 29 వతేదీన అనగా నందననామ సంవత్సర మార్గశిర శుద్ధదశమి మంగళవారము దినమున 'త్రామపురము' అని పేర్గాంచినట్టి గణపతిదేవుడు, జాయపసేనాని, యుద్ధమల్లుడు మున్నగు వీరులు విహరించిన, దొడ్డ కాలంబు బౌద్ధజైనులకు వాసస్థలంబైన 'చేబ్రోలు' గ్రామములో సూర్యదేవర వంశమున, 'నాగయ్య వెంకమాంబ' యను దంపతుల కుద్భవించిరి. వెంకమాంబ, గోళ్లమూడివారి తోబుట్టువడుచై యున్నది.

ఆగర్భశ్రీమంతులైన భూస్వామి గర్భమున జననంబందుటచేసి, ఏవిధమైన లోటులేకుండా జననీజనకులు నరసయ్యగారి నల్లారుముద్దుగ బెంచిరి. బాల్యములో నొకటి రెండేండ్లకాలముకంటె ఎక్కువకాలము విద్యాభ్యాస మొనర్చలేదు. బాల్యము నుండి వీరు బీదలయందు ప్రేమ, పరిజనులందు కృప, దీనుల యందు దాక్షిణ్యము, నిరాడంబరజీవితము, పరోపకారబుద్ధిగల్గి యుండిరి. పూవుపుట్టగనే పరిమళించునుగదా ! కార్యసాధన విషయములో భల్లూకపుపట్టుపట్టెడి స్వభావమువీరికి ఆదినుండి కలదు. తనసద్గుణసంపదచేత నెల్లరకు ప్రేమపాత్రులగుచు, శుక్లపక్షచంద్రునివలె దినదినప్రవర్ధమాను లగుచుండిరి.

## 2. యౌవన కాలము – గార్హస్థ్యజీవితము

యౌవన మంకురించి నంతనే వివాహ ప్రయత్నము

లారంభమాయెను. వల్లమూడి గ్రామవాస్తవ్యురాలు వాసి రెడ్డివారి తోబుట్టుపడుచు 'సీతమ్మ' ఈయన ప్రథమకళత్రము. క్రీ. శ. 1908 లో నీ బాలికామణి నీయన పరిణయమాడెను. యోగ్యమైన సంబంధము లభించుటచేత, సీతమ్మ జననీజనకుల కోరిక ఫలించెను. 'కృష్ణకవి' శకుంతలాపరిణయములో దమ సుతకు తలిదండ్రు లెట్టి వరునిగూర్చునది, యిట్లువర్ణించెను. "తలిదండ్రుల్ దొలుదొల్తఁ గూతునకు నుద్వాహంబు గావింపగా దలఁపుల్ పుట్టిన వీర్య శౌర్య గుణ విద్యా సంపదాచారవు మ్కల మూర్తిన్ వరుఁ గూర్తురు" 'జ గ మెరిగిన బ్రాహ్మణునికి జందెమేల' యన్నట్లు, చరిత్రలో గణుతి కెక్కిన వాసిరెడ్డి వంశీకులగు లలనామణులగూర్చి వేరుగా వ్రాయనక్కరలేదు. వాసిరెడ్డివారి తనూజలనుగూర్చి, వారి శీలగుణ వృత్తములనుగూర్చి, కవులు ఉల్లేఖించిరి. కొందరు వనితాలలామలు భర్తలు మృతినొందినపుడు, వారితోబాటు మరణించి, పేరంటాండ్రై చరిత్రకెక్కిరి. అందు వాసిరెడ్డి మల్లి కార్జునరాయలభార్య, (రావెళ్లవారి తోబుట్టువు) జగ్గన్నభార్య అచ్చమ్మ, ముఖ్యులై యున్నారు. అచ్చమ్మసహగమనము చేసెను.

వివాహముయొక్క ముఖ్యోద్దేశ్యము సంతానము కొరకే, (Progeny) యని వివాహ చరిత్రకారులువ్రాసినారు. ద్వాదశవర్షంబులు గడచిన నవ్వనితారత్నంబు వలన సంతానము లేదు. అనుపమభాగ్యంబు లెన్నియున్న, భూరిసౌఖ్యము లెన్ని యున్న, వంధ్యాజీవితంబు గడపుట స్త్రీకి సంతత విషాదదా

యకం బగుచున్నది. వారికి నానావిధభోగమ్ములు నానందము గల్గిన, బిడ్డలులేనికొరత దొడ్డదైయుండెను. తిరిగి క్రీ.శ. 1920లో నరసయ్యగారు 'చిరుమామిళ్ళ' వారి వంశీకురాలగు 'విశాలాక్షమ్మను' వివాహమాడెను. కాని ఈ కాంతాలలామ వలన కూడ సంతానప్రాప్తి గల్గలేదు.

"కులగోత్ర సంపదగలిగి రాజప్రీతి
మెలఁగినట్టి చిఱుమామిళ్ళవారు"

అని చాటువులలో పేర్గాంచిన ఈకుటుంబము వాసిరెడ్డివారికి ముఖ్యబంధువులుగా నున్నారు. అల్పాయుర్దాయవంతురాలగు 'విశాలాక్షమ్మ' కొలదికాలము సంసారముచేసినవెనుక అకాల మృత్యువాతబడెను. ప్రియావియోగసంజనిత దురంతతాపమును దిగమ్రింగి, ధైర్యహిమాచలుడగుటచేత, అధైర్యము వహించక తిరిగి, క్రీ. శ. 1942 లో 'చినపాలెము' గ్రామవాస్తవ్యురాలగు 'వాసిరెడ్డి రంగనాయకమ్మ' యను కన్యకామణిని బెండ్లాడెను; కాని ఈతన్వివలన కూడ సంతులేకుండెను. ఎన్ని వ్రతములు నోము లాచరించినను, ఎన్నియో తీర్థాచరణంబులు జేసినను, ఎందరో సాధుసజ్జనుల సాంగత్యప్రాప్తిని బొందినను, ఈ దంపతులకు సంతానభాగ్యము లేకున్నది. ఈయన ధర్మపత్ను లందరికి వాసిరెడ్డి వేంకటాద్రినాయని భార్యలవలె, సంతానము లేమి, స్వాంతంబుల నెంతయు జింతగల్గిన దనుటలో సందియము లేదు. ఈసందర్భములో నాకు శ్రీనాథరచితమగు 'శివరాత్రి మాహాత్మ్యము'లోని ఈక్రిందిపద్యములు జ్ఞప్తికి వచ్చుచున్నవి.

గీ॥ అన్నిభాగ్యంబులున్న · నయ్యబ్జముఖికి
శ్రీమహాలక్ష్మి గలుగఁగ నేమి సెలగు
పుత్రవదనావలోక నోద్భూతమైన
యొక్క సౌఖ్యంబు ప్రాప్తియైయుండఁగాన॥

గీ॥ ఎఱుఁగునే నీడకన్నను నెండకన్నుఁ
జెలగి పూఁచునేకర్మ వచ్చినలతాంగి
యెట్టిక్లేశంబులకు నైననీడఁబోదు
తనమనంబున నిగ్రుచు సంతానకాంక్ష॥

సీ॥ భక్తితో మాతృకా భవనంబులకు నేఁగుఁ
గావించు నతిథిసత్కారములను
వాయసంబులకు నిర్వర్తించు దధిబలిఁ
గొలుచు జ్యేష్ఠాదేవి నలఘుమహిమఁ
జదివించుకొనుఁ బుణ్యసంహితావ్రాతంబు
మాలికా మాణిక్యములు ధరించుఁ
దన్వంగి గంధాక్షతలు చిరంటులకిడు
విప్రశ్నికల గారవించుఁదఱచుఁ

గీ॥ గుమ్మరావంబు కడవలు కొల్లవిడుచు
బాలురకుఁ దియ్య పండులు పంచియిచ్చుఁ
జెలులఁ దానును వ్రతములు సలుపుచుండుఁ
దామరసనేత్ర పుత్రసంతానకాంక్ష॥

సంతానార్థమై, ఈకుటుంబములో జేయుకర్మకాండయంతయు
పై పద్యములోని వి ష య ము ల ను జ్ఞప్తికి దెచ్చుచున్నవి

నరసయ్యగారు సద్వర్తనా సంశోభితుడైన కృషీవలుడై భూత దయ, పశువులందు ప్రేమగల్గియున్నారు. స్వయముగా పశువులకు త్రాళ్లు వేసికొనుచు, పశుపోషణ చేసికొనుచు, అవసరమైనచో పశువైద్యమొనర్చుచు, నిరాడంబర రైతు జీవన మొనర్చుచున్నారు.

## 3. ధర్మకార్యములు

వీరు నిరంతర దాన తత్పరులు; ఉదారస్వభావులు. తన తల్లి 'వెంకమాంబ' గారి పేరుతో రు 12000 లు ఖరీదు చేయు భవనమును గట్టించి దీనిని "చేబ్రోలు"లోని గ్రంథాలయమునకు ధర్మముగా నొసగి దీనికి "వెంకమాంబా" గ్రంథాలయమని నామకరణమిడెను. తన తలిదండ్రులపేరున చేబ్రోలులో నొక ఉన్నత పాఠశాలను స్థాపించి యకరము 1కి రు 15000లు ఖరీదుచేయు య 1-17 సెంట్లు స్థలములో దాదాపు రు 85000 ల ఖర్చుతో భవన నిర్మాణ మొనర్చి, దాని పోషణకు, అధ్యాపకుల జీతములకుగాను శాశ్వతముగా నుండునట్లు య $9\frac{1}{2}$ ల శేరీ మాగాణి భూమిని ధర్మార్థ మొసంగెను. ఈ విధముగా జననీ జనకులపేరు ఆచంద్ర తారార్కముగా నుండునట్లొనర్చెను. ప్రతి వర్షము ఉన్నత పాఠశాలకగు వ్యయము సర్కారు గ్రాంటుపోను మిగతా రు 5000లు భరించుచున్నారు. అనేకమంది బీదవిద్యార్థులకు జీతము మినహాయింపు దరఖాస్తులను మంజూరుచేసి వారికి పలువిధముల సాయ మొనర్చుచున్నారు.

క్రీ. శ. 1914 లో చేబ్రోలులో ప్రథమముగా మాధ్యమిక పాఠశాలను స్థాపించినపుడు వీరొక పోషకులుగా నుండిరి. క్రీ. శ. 1921లో దీనిని జాతీయ పాఠశాలగా మార్చవలసినదని కొందరు ప్రముఖులు వచ్చి బలాత్కారముచేసినను, వీరా సూచనను త్రోసిపుచ్చి, ఆంగ్ల విద్యాభ్యాసము వలననే విద్యార్థులకు శాస్త్రజన్య జ్ఞానము గల్గునని జాన్ డ్యూయీ (John Dewey) చెప్పినట్లు ఆధునిక భావములు (current thought) గల్గవలెనన్న ఆంగ్లేయభాష యవసరమని వాదించి నిర్మొగమాటముగ పల్కి వారిని సాగనంపిరి. ఇట్టి లౌకిక భావములు వీరికి చిరకాలమునుండి కలవు. ఇట్టివారిని మేము ఒజ్జలని తలంచెదము. ఈ భావ సంపదనే దేశమునకు ప్రబోధించిన శ్రీశక్తిసంపన్నుడు "రాజాజీ" శ్రీ. శే. గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారు చిరస్మరణీయులు. భాషావిషయమై నాతో 'రాజాజీ' చేసిన భాషణము, మధురమై అమృత పూరితమైయుండి నన్ను ఆనందకందళితహృదయారవిందుని జేసినది.

## 4. రాజకీయ జీవితము

రాజకీయములన్న వీరికి మక్కువలేదు. పైగా రాజకీయములలో నెన్నికలలో బెట్టు దుర్భరవ్యయము సప్తవ్యసనములకు దుల్యమైనదని నమ్మువారిలో వీరొకరు. ఈ విముఖత్వము చేతనే వీరు రాజకీయములకు సంతతము దూరస్థులై యుందురు. పలువురి ప్రోత్సాహమున వీరొకపర్యాయము గ్రామపంచాయితీ సభ్యులై ప్రజాసేవచేసిరి. గ్రామములోగల

'సహకార సంఘ ధననిధి'కి డైరెక్టరుగా నుండి, ప్రజలమన్నన లకు బాత్రులైరి. ఇట్టివారు రాజకీయములలో బ్రవేశించినను స్వార్థరహితమగు ప్రజాసేవ చేయుదురేకాని 'ధనమూలమిదం జగత్'అని కృత్రిమమగు వంచనమార్గముల ధనార్జనకు గడంగ రని స్పష్టముగా వచించవచ్చును.

## 5. శీలసంపత్తి

వీరు గొప్ప విద్యావంతులు గాకపోయినను నయవిద్యను కూలంకషముగా నేర్చినవారు. ఋషి కాకపోయినను అపరిగ్రహవ్రతాది ఋషిప్రోక్త ధర్మముల ననుసరించువారు; ఆంగ్ల విద్యాపరిచయము లేకపోయినను పశ్చిమదేశీయులవలె తమ ద్రవ్యమును పాఠశాలలు, గ్రంథాలయములు, బీదవిద్యార్థి వేతనములు, ధర్మసంస్థలు, సద్గ్రంథ ముద్రణము మున్నగువానికి వెదజల్లు ఆధునిక భావసంపదగలవారు. 'నవ్యనవనీత తుల్యమైన మనంబు' వెన్నవలె కరంగు హృదయంబు గలవారు.

తన తల్లి మృతినొందిన సందర్భములో 'మాతృస్మృతి' యనుపేర, 'వేదాంతకవి' చేత నొక పద్యకావ్యమును వ్రాయించి. దానిని ముద్రణచేయించెను. ప్రస్తుత గ్రంథమగు 'సూర్యదేవర రాజన్యచరిత్రను' పరిశోధన చేయించి వెలుగులోనికి దీసికొని వచ్చుటకు వీరేకారణభూతులు. ఆధునికభావముల కనుగుణ్యమగు పెక్కుధర్మకార్యము లొనర్చుటకు వీరికి శక్తి, అభిలాష, దీర్ఘాయుర్దాయము గల్గుగాత! యనికోరుచున్నాను.

---

# గ్రంథకర్త రచించిన ఇతర గ్రంథములపై పత్రికాధిపతుల అభిప్రాయములు

## మహాభారత విమర్శనము

I

The work under review is not criticism of the text of the Mahabharata as the title indicates, bu a recapitulation of the various theories advanced by scholars, both Eastern and Western, regarding the date of the great Epic, which ranges from 3102 B.C. to 950 B.C. The author, after discussing the views on the subject, arrives at the conclusion that the Mahabharata was composed by Vyasa about 950 B.C. This certainly goes against the traditionally accepted date of the Mahabharata, about the end of Dwapara Yuga and the beginning of the Kali Yuga. But the method followed in this present work is purely historical and deserves commendation.

Besides this main theme interesting problems like the authorship of Vyasa, the birth of the Pandavas, the practice of polygamy are also discussed. In consonance with the views of western scholars, the author states that the Pandavas were foreigners to India, as they adopted the customs and manners of the Scythians like Sati and drinking the blood of the enemy. These views deserve to be closely examined.

The author has to his credit a number of works relating to the historical and philosophic aspects of Indian culture, and the present work is a welcome addition to the list. The value of this work would have been enhanced and much of the labour in collecting the material could have been avoided if the author had referred to two outstanding works in Telugu on the subject, the Mahabharata Charitra by the late Pendyala Venkata Subrahmanya Sastry and Mahabharatha Tattwa Kathanamu by Sri Varanasi Subrahmanya Sastry, both belonging to Pithapuram in Andhra Pradesh. The two authors are great Sanskrit and Telugu scholars and the former work of Subrahmanya Sastry was greatly appreciated by the well known Western Orientalist Sir Berriedale Keith for its correct interpretation of the original text and its modern critical outlook. —The Hindu, dated 14–9–1958.

---

## మహాభారత హృదయ మర్మ భేదనం

భారత సాహిత్యములో భారతాని కొక విశిష్టస్థాన మున్నది. కావుననే నన్నయ "ధర్మశాస్త్రజ్ఞులు ధర్మశాస్త్రంబని, అధ్యాత్మక విదులు వేదాంతమయు..." అంటూ ఆ విశిష్టతను వేనోళ్ల కీర్తించినాడు. పురాణంలా విస్తృతమైనా, వేనవేల విషయాలున్నా అందులో ఒక వంశం, ఒక కుటుంబం అందు కు చెందిన వివరాలూ, వివాదాలూ, వేదనలూ, విశేషాలు ఒక లంకెకుతగిల్చి ఒక ఏకతను సాధించుకొన్న గ్రంథం.

వందలకొలది కాదు. వేలకొలది పాత్రలను వివరంగా విశిష్టంగా, సున్నితంగా సూక్ష్మంగా రూపొందించిన అద్భుత ప్రతిభ మనలను విభ్రాంతులను చేస్తుంది.

ఊరూరా ఇంటింటా ప్రవృత్తమై అందలి మనుష్యులూ, మనసులూ మన జీవితంలో మన యెదుట ప్రవర్తిల్లినంత గాఢంగా మన మనోముద్రితా లయిపోయినవంటే, ఆ మహా ద్భుతసృష్టిని మనం కొనియాడకుండా ఉండలేము.

అష్టాదశ పురాణాలలో చేరకున్నా, భారతాన్ని పంచమ వేదమనే భావించిన పెద్దలకు ఆ గ్రంథం యెడలనున్న గురుభావం ద్యోతక మవుతుంది.

వేదాలను సంపుటీకరించినవాడూ, పురాణాలు పద్దెనిమి దింటిని వ్రాసినవాడూ అయిన వ్యాసుడే దీనినీ రచించెనంటారు. కొందరు వేర్వేరు వ్యాసులున్నారంటారు.

ఇదంతా సరిగ్గా చరిత్రేనని కొందరంటే, అందులో ఉన్నట్టు కానేకాదనీ కురు పాండవులబాంధవ్య మలా లేదనీ మరికొందఱంటారు

ఈ భారతకాల దేశాదులను గూర్చీ, కర్తృత్వాన్నిగూర్చీ చాలకాలం నుంచీ చర్చలు సాగుతున్నవి.

అందులోని జ్యోతిష ప్రస్తావనలను ఆధారంగా చేసుకొని కొందఱు కలియుగాదని నిశ్చయించినా, స్వామికణ్ణుపిళ్ళై వంటి ప్రఖ్యాత విజ్ఞులు ఆ గ్రహగతు లలా ఎన్నడూరావని, కొన్ని అతకనిరీతిగా గ్రహసంయుతులూ అవీఉన్నవనీ వివరించినారు

అట్లే కురుపాండవుల సంబంధ బాంధవ్యాలూ, వారి నివాస ప్రాంతాలూ కూడా వివాదాస్పదము లైనవి.

అసలు భారతంలో అనేకాలు ప్రక్షిప్తాలు కాలక్రమాను గతములై చేరుతూ వచ్చినవని, ఆమూల పాఠమేదో నిర్ణయించ వలెనని భాండార్కర్ పండితు లొక సంస్థనే నిర్మించి, వేల కొలది వ్రాతప్రతులనూ, వివిధ ప్రాంతాల ముద్రిత ప్రతులనూ ఆంతర బహిఃప్రమాణాలనూ పురస్కరించుకొని సిసలైన అసలు పాఠం నిర్ణయిస్తు ఒకొక్క పర్వాన్నే ప్రచురించసాగినారు. అక్కడ ఎందరో పండితులు కృషిచేస్తూ వస్తున్నారు.

ఇక ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య చరిత్రకారులెందరో ఈ విషయమై అనేక గ్రంథాలు సమకూర్చినారు.

ఈ విషయ సామగ్రి నంతటినీ సమగ్రంగా పరిశీలించి ఒక గ్రంథం తెలుగులో సమకూర్చి (శ్రీ) కొడాలి లక్ష్మీనారాయణగా రిప్పుడు ప్రచురించినారు.

ప్రాచీన చరిత్రాది పరిశోధనలో చాలాకాలంనుంచి మునిగితేలుతూ అనేక గ్రంథాలు రచించిన గ్రంథకర్త, భారతంపై వచ్చిన అనేక రచనలను సునిశితంగా పరిశీలించి పూర్వం ఆంధ్రప్రభలో వ్రాసిన వ్యాసాలూ, మరికొన్ని కలిపి ఈ గ్రంథం వెలయించినారు.

భారతకాలాన్ని గురించీ భారత యుద్ధకాలాన్ని గురించీ ఉన్నన్ని అభిప్రాయభేదాలు మరేమిటాఉండవు. వాని నన్నింటినీ వీరు క్షుణ్ణంగా పరిశీలించినారు. తుదకు యుద్ధకాలం 950

క్రీస్తు పూర్వమని తేల్చినారు. కొన్ని పదుల తేడాతో ఈ కాల నిర్ణయం దాదాపు చాలమంది పరిశోధకు లంగీకరించినదే.

మరీ పాతగిల్లినదంతా పరమామృత మవుతుందన్నట్టుగా వెనుకకు జరుపుతూ రావటం ఇటీవల కొందరు ప్రాక్పండితులకు అలవాటయినది. ఇలాంటివానిలో అంత ఆవేశకావేషాలతో అదేపనిగా వెనుకకు నెట్టవలసిన అవసరం ఏమున్నదో అర్థంకాదు.

ఆనుషంగికంగా వీరు వేదకాల నిర్ణయంచేయవలసి వచ్చినది. ఈ విషయంలో విపరీతంగా విభేదం సూచించే రీతిని ఒక్కొక్కరు వ్రాస్తూవచ్చినారు. క్రీస్తు పూర్వం నాలుగు వేలకు ముందుకు నెట్టినవారూ ఉన్నారు. మఱీ క్రీస్తు పూర్వం నాలుగయిదు వందలకు లాగినవారూ ఉన్నారు. కానీ మామూలుగా చాలమంది చాలఉపపత్తులతో స్వీకరించిన క్రీస్తు పూర్వం 1300 ప్రాంతమని వీరన్నారు. నక్షత్రగణం కృత్తికాది ఆరంభమైనదని లెక్కవేసి 1400 ప్రాంతములో అథర్వవేదం వచ్చినదనీ, అంతకుపూర్వం మిగత వేదాలు కనుక కొంత వెనక్కు వేసిన వాదమూ ఉన్నది.

తొలుత జయ పేర భారతం చిన్నదిగా ఉండెడిదనీ తర్వాత పెరిగినదనీ వివరించినారు భిన్న భిన్న కాలములలో భిన్న భిన్న మేధావులు అనేకం ఇందులో చేర్చిరన్నది దాదాపు అందఱూ అంగీకరించినదే.

భారతకాల నిర్ణయంలో బాహ్యప్రమాణాలచర్చ చాల సమగ్రంగా ఉన్నది.

ఇక అంతర ప్రమాణ సమన్వయం చాలకష్టతరమైనది. కొన్ని ఆచార వ్యవహారాలనుబట్టిగాని, కొన్ని నామసామ్యాలను బట్టిగాని, ఏదీనిర్ణయించడంకష్టం. ఒకకాలంలోనే అనేక విధాలైన సాంఘిక వ్యవస్థ లంటూవచ్చిన భారతదేశంలో, ఒక సాంఘికాచారం ఫలానా అప్పటిదే అనిగాని, ఫలానా ప్రాంతందే అనిగాని చెప్పడంకష్టం.

ఏమైనప్పటికి జయ భారతమై, మహాభారతముగా నేటి రూపులోకిరావలసి రాగా క్రీ.పూ. 10 వ శతాబ్ది నుండి క్రీస్తు శకం 4 వ శతాబ్దిదాకా పట్టి ఉంటుందన్నది వివాదాస్పదం కానక్కరలేదు. బహుపతీత్వం ఉన్నది కనుక పాండవులు దేశీయులు కారని ఆర్యేతరాచారమిది అనీ అంతగట్టిగా చెప్పడం సాధ్యం కాదనుకుంటాను.

బహు ప్రాచీనాచారావశేషాలు చాలాచాలా పురాణ కథలలో కానవస్తూవుంటాయి. పాండవులు సిథియను లే కానక్కరలేదు. ఏ అతి ప్రాచీనాచారమో అందులోనికి ఎక్కియుండవచ్చును. అంతేకాక రక్తపానం ఆర్యులకు ఆచారం కాదన్నదీ అంతే. ఒక ప్రతిజ్ఞ తీర్చుకొనుపట్టున, ఆపరాని కసిని పచ్చి కసిని తీర్చుకున్న తీరును చెప్పటలోఅలా అన్నంత మాత్రంలో అది ఆచారంకావాలా ?

ఏమైనా క్షుణ్ణంగా, నిశితంగా భారత విషయమై వచ్చిన అనంత సారస్వతాన్ని అవలోకనంచేసి, సమన్వయం చేసుకొని ఈ గ్రంథం రచించిరనుట నిస్సందేహం.

ఈ గ్రంథం రచనలో మఱీ పదేపదే పుటపుటలోనూ ఒక్కొక్కరూ, ఒక్కొక్క విషయంలోనూ ఏమన్నారో వరుసబెట్టి చెప్తూ ఉన్నందువల్ల సారళ్యం కొరవడినదని చెప్పక తప్పదు. అన్నిటినీ చదివి మననం చేసుకొని, వానిలో మఱీ సామాన్యమైనవీ కొంతమాత్రం భేదం కలవీవదలివేసి చరచరా తత్సార సమాహారం మనకందివ్వాలి. అందులో అక్కడక్కడా గ్రంథ కర్త తానెందుకిలా అభిప్రాయ పడవలసి వచ్చినదో తెలియ జెప్పవలసిన పట్ల ముఖ్య సిద్ధాంతాలమూల కర్తలను అనువదిస్తే చాలును కదా.

అన్నిటినీ చెప్పడం, ఉటంకించడం వల్ల విస్పష్టతకూ, వైశద్యానికి దెబ్బ తగుల గలదనే నేనంటున్నది.

ఇంత పరిశోధన చేసి ఒకచో భారతకాల దేశాదుల విషయమై సమగ్రదృశ్యం కన్పింపజేసిన గ్రంథకర్తను మనసారా అభినందిస్తున్నాను.

విశ్వం – ఆంధ్రపత్రిక **29–12–1957**

III

మహాభారత గాథ వాస్తవికతను, రచనాకాలాన్ని చారిత్రక దృష్టితో పరిశీలించినగ్రంథాలు తెలుగులో ఇదివరకే కొన్ని వెలువడినవి. పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి గ్రంథం ఇట్టి పరిశీలనకు నాంది అని చెప్పవచ్చు. అదేకోవకు చెందిన మరొక పరిశీలనాగ్రంథాన్ని శ్రీ లక్ష్మీనారాయణ గారు వెలువరించారు.

నేడు మహాభారత కావ్యంగా పరిగణించబడుతున్న గ్రంథం క్రీ.పూ. 10 వ శతాబ్దంనుండి, క్రీ.శ. 4 వ శతాబ్దివరకు క్రమంగా ఒక్కొక్క మహాకవిచే విస్తరింపబడుతూ వచ్చిందని రచయిత ప్రామాణికంగా నిరూపించారు. భారతయుద్ధంలోని వాస్తవిక గాధ క్రీ.పూ. పదవశతాబ్దిలో జరిగివుంటుందని రచయిత అభిప్రాయపడుతున్నారు. కురుపాంచాల యుద్ధప్రస్తావన మాత్రమే బ్రాహ్మణములలో ఉన్నందున అదిమాత్రమే వాస్తవగాధయనీ, పాండవులు పాంచాలురతరపున యుద్ధంచేసిన విదేశీయులని కూడ శ్రీ లక్ష్మీనారాయణగారు నిరూపించ యత్నించారు.

భారత గాధ కాలాన్నిగురించి, కావ్యవిస్తరణను గురించి రచయిత అభిప్రాయాలు ఎక్కువమంది చారిత్రకులంగీకరించినవే. కాని పాండవులన్యదేశీయులని, అసలు కురుపాంచాల యుద్ధమే ఈకథకంతా మూలమనీ వీరుచేసిన వాదనమాత్రం సమంజసంగాలేదు.

కురుపాండవులు, అన్నదమ్ముల సంతతియై, రాజ్యలోభంతో మహాయుద్ధానికి తలపడినగాధ ఒక చారిత్రక సత్యం. రాచరిక వ్యవస్థలోని అంతర్వైరుధ్యాలకిది చిహ్నం. దారుణ యుద్ధంగా పరిణమించిన ఈ కుటుంబకలహగాధ, జనశృతిగా, భారతీయ సంస్కృతిలో వేళ్ళూరి ఇతిహాసమైంది. దీనిని వేర్వేరు కవులు వేర్వేరు కాలాలలో, వేర్వేరు ప్రయోజనాలతో పెంచి పెద్దదిచేశారు. మహాభారతానికి భారతీయసాహిత్యంలో గల విశేషప్రచారానికిదేమూలం.

ఒకగాథ చారిత్రకతను నిర్ణయించేటప్పుడు కావ్యంలోని అంతరంగిక ప్రమాణాలు, భాష, కథలు, ఆచారాలు, కల్పనలు— వీటికిమాత్రమే విశేష ప్రాధాన్యత ఇవ్వటం సరికాదు. చారిత్రక పరిణామదృష్టితో అనగా బాహ్యప్రమాణంతో కూడ, పరిశీలించవలసి ఉంటుంది.

శ్రీ లక్ష్మీనారాయణ గారు ఈ చారిత్రక దృష్టిని అంతగా గణనలోకి తీసుకోలేదనిపిస్తుంది. ఋక్, యజు, స్సామ వేదములు మూడూ క్రీ.పూ. 1300 నుండి క్రీ.పూ. 975 మధ్య అనగా మహాభారత గాథకు రెండుమూడు శతాబ్దాలకుముందు రచించబడ్డాయనే వీరివాదనకూడ సరికాదు. వేదాలు, బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు అను ఈ వేదవాఙ్మయ సృష్టి, తాత్త్వికసిద్ధాంతపరిణామానికి అనుగుణ్యంగా జరిగింది. వేదవాఙ్మయంలోని ఆర్యుల ఉత్సాహోద్వేగాలు చల్లబడి, కర్మకాండగామారిన దశలో బ్రాహ్మణములుఏర్పడ్డాయి. కర్మకాండపై తిరుగుబాటుగా తత్వజిజ్ఞాస ఉపనిషత్తులలో ఉన్నత స్థాయి నందుకున్నది. ఉపనిషత్తుల రచన క్రీ.పూ 1300లో ప్రారంభమైందని చారిత్రకులు అంగీకరిస్తున్నారు. కనుక వేదవాఙ్మయ పరిణామం అంతా ఒక 6, 7, శతాబ్దాలకు తక్కువగాని కాలంలో జరిగిఉండాలి. ఇంకా ఎక్కువగావచ్చు. కనుక వేదాల ప్రారంభం క్రీ.పూ. 2 వేలు అని భావించటం సవ్యంగావుంటుంది.

పరిశోధనా విషయాలలో భేదాభిప్రాయాలుండటం సహజం. లక్ష్మీనారాయణగారి నిర్ణయాలెలాఉన్నా వారి కృషి మాత్రం, పట్టుదలకు, పాండిత్యానికి చిహ్నంగా ఉంది.

విశాలాంధ్ర 24.11.'57

# సామాజిక పథకములు

I

In explaining the aims and objects of the Community Project and N. E. S. Schemes, which form the main plank of the India Government's Community Development programme, the author of this pamphlet lays stress on the spirit of self-help and social consciousness that they rely on and intend to foster among the rural people. With a penchant for historical research, he traces the idea of popular initiative and participation (which are not less vital than the reaching of physical targets and the using up of funds allotted) far back into the early centuries of Indian history. The Prajatantra states of the Buddhist period and the village republics of a later period are discussed as examples of ancient Indian democracy in practice, with quotations from appropriate authorities. Reference is also made to the Chola Kingdoms of the South which had encouraged a kind of collective ownership and community consciousness long before any part of the world had thought of community projects and the like.

The Hindu – Dated 3–11–1957

II

ప్రాచీన కాలంనుండి సామాజికదృష్టి భారతీయ సంస్కృతిలో ఎలా అవిచ్ఛిన్నంగా వస్తున్నదో రచయిత అనేక ఉదాహరణ లిచ్చి నిరూపించారు. ఆంధ్రుల చరిత్రనుండి, బౌద్ధజాతక

కథలనుండి అసంఖ్యాకములైన వివరాలను సేకరించి అందించిన వీరికృషి ప్రశంసనీయం.

నేడు ప్రభుత్వంనిర్వహిస్తున్న సామాజికాభ్యుదయ పథకాలు (కమ్యూనిటీ డెవలప్ మెంటు స్కీములు) ఈ ప్రాచీన సంప్రదాయాన్ని కొనసాగించి, ఆర్థిక, సాంఘిక పునర్నిర్మాణానికి ఉపకరించగలవని రచయితభావన.

సామాజిక దృష్టి కీలకంగా ఆర్థిక సాంఘిక పునర్నిర్మాణం జరగాలనేలక్ష్యంలో ఎవరికీ అభిప్రాయ భేదంలేదు. తప్పక అట్టి పరివర్తన జరిగితీరాలి. అయితే అందుకు, ప్రస్తుతం ప్రభుత్వం వారు నిర్వహిస్తున్న కమ్యూనిటీ డెవలప్ మెంటు స్కీములు సాధనాలని రచయిత వెలిబుచ్చినఅభిప్రాయంతో ఏకీభవించటం మాత్రం కష్టం. విశాలాంధ్ర 24–11–'57

---

Bharat Sevek Samaj *National Head Quarters*

*President*: NEW DELHI,

JAWAHARILAL NEHRU *Oct 24, 1952*

*Dear friend,*

I thank you for your letter dated 14th October, 1952, addressed to Shri Jawaharilal Nehru.

I am happy to note that you have a genius for writing work. We shall certainly contact you as and when we need your services. In the meanwhile you can forward your articles on Community projects etc. to this office, if you so desire.

*Shri* *Yours in service,*

K. L. NARAYANA. B. A., (Sd.) N. L. VARMA

MOPARRU *Administration Secretary*

# విస్మృత ఆంధ్ర నాయకుల చరిత్ర

## I

ఈ గ్రంథములో లక్ష్మీనారాయణగారు కమ్మకులం పుట్టుకనుగురించి, ఆ కుటుంబంలో ప్రఖ్యాతిగాంచిన ప్రాచీన వీరులను గురించి చర్చించారు.

కాకతీయ రాజైన మొదటి ప్రతాప రుద్రుని కాలంలో (క్రీ. శ. 1100) మొట్టమొదటగా కమ్మ, వెలమ, రెడ్డి, కాపు అను కులవిభేదము లేర్పడ్డాయని రచయిత సోదాహరణంగా చర్చించారు. పల్నాటియుద్ధంలో కమ్మ, వెలమ ద్వేషాలు ప్రజ్వరిల్లాయనే వాదనకూడ సమంజసమే. బ్రహ్మనాయుడు. పద్మవెలమకులానికి మూలపురుషుడుగాగు ర్తించబడుతున్నాడు.

ముసునూరి నాయకులు ముహమ్మదీయులకు వ్యతిరేకంగా సాగించిన వీరోచిత పోరాటం జయప్రదమైకూడా రెడ్డి, వెలమ, కమ్మ, కులవిభేదాల ఫలితంగా తిరిగి ఎలా నీర్పగారిపోయిందో రచయిత తెలియజేశారు. దేవరకొండ వెలమనాయకులు, కొండవీటి రెడ్డిరాజులు, కమ్మవారైన ముసునూరి నాయకులు ఐకమత్యాన్ని సాధించలేకపోయిన విషాదపరిస్థితి ముహమ్మదీయ దిగ్విజయానికి మూలం.

విజయనగర కాలంలోను, అటుపిమ్మట ప్రసిద్ధిచెందిన కమ్మనాయకుల కథలను చింతపల్లి జమీందారైన వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడుగారి గాథలను రచయిత రసవంతముగా వర్ణించాడు.

అయితే, ఈ కులాల పుట్టుకనుగురించి రచయిత చేసిన ఊహ మాత్రం సరికాదు. శాతవాహనులకంటె ముందే లిచ్ఛవి, ఇక్ష్వాకు రాజగణాలకు చెందిన కూర్మిలను ఆర్య క్షత్రియులు దక్షిణాదికి తరలివచ్చారని, అలా తరలివచ్చిన ఆర్య క్షత్రియులే 'కమ్మ'వారుగా కాలక్రమేణ రూపొందారని వీరి ఊహ. ఇది నిరాధారము. కర్మరాష్ట్రం, కమ్మ, కుర్మి అను మాటల పోలికనుబట్టి ఇట్టి సిద్ధాంతం చేయటం అసమంజసం.

కమ్మ, రెడ్డి, వెలమ, కాపులు— చతుర్థ వంశజులు కారని, ఆర్యక్షత్రియులేనని నిరూపించ ప్రయత్నించడం కుల విభేదాలలో కాలక్రమేణవచ్చిన ఔన్నత్య, న్యూనతాభావాలను వెనుకకు పొడిగించడం తప్ప వేరు కాదు.

11వ శతాబ్దికిపూర్వం ఆంధ్ర దేశంలో కమ్మ, వెలమ, రెడ్డి, కాపు అను కులాలు లేవు. శాతవాహనులు, ఇక్ష్వాకులు పల్లవులు, శాలంకాయనులు, చోళులు, చాళుక్యులు, కాకతీయులు, రాష్ట్రకూటులు— వీరిపేర్లే మనకు కనిపిస్తాయి. వీరందరూ కొన్ని తెగలుగా వంశాలుగావచ్చి దేశంలో స్థిరపడ్డవారు, లేక కొన్ని తెగలుగా వంశాలుగా ఏర్పడ్డవారు. సంఖ్యహెచ్చి రాజ్యాధికారం నశించి, సైనికవృత్తి ప్రాబల్యం తగ్గి వ్యవసాయ వృత్తిప్రాబల్యం హెచ్చినకొద్దీ వీరంతా వ్యవసాయకవర్గాలుగా స్థిరపడ్డారు. విజయనగర రాజులకుముందు (1400) ఆంధ్రులకు స్థిరసైన్యాలు లేవు; శాంతికాలంలో కర్షకుడు, యుద్ధకాలంలో సైనికుడుగా మారేవాడు.

కాకతీయుల కాలంనాటికి క్రొత్త తెగలు, లేక వంశాలు

మన దేశానికి రావటం, లేక ఏర్పడటం ఆగిపోయింది. జ
సంఖ్య పెరిగింది. వారి వంశాలు నశించి, కొత్తవంశాలు త
ఎత్తాయి. రాష్ట్ర కూటులలో ఎక్కువమంది రెడ్డికులంగ
మారగా చోళ చాళుక్య వంశాలు కమ్మ, వెలమ, కాపులుగ
రూపొందినట్లు చరిత్ర చెప్పుచున్నది.

ఈ సాంఘిక పరిణామం 11 వ శతాబ్దంలో ఆంధ్ర దేశంలో
జరిగింది.

శ్రీ లక్ష్మీనారాయణగారు ఇట్టి చారిత్రక దృష్టితో
కులాల పుట్టుకను పరిశీలించకపోవడం విచారకరం.

విశాలాంధ్ర 24-11-

## II

ఆంధ్ర దేశ చరిత్ర, మొత్తం భారతదేశ చరిత్రలో అ
ప్రాచీనమైన, ముఖ్యమైన భాగంగా పేర్కొనవచ్చు. ఆంధ్ర
చరిత్రలో రెడ్డిరాజులపాలన, కమ్మ, వెలమ, తెలగ నాయకు
పాలన సుప్రసిద్ధమైనది.

కాకతీయుల పతనానంతరం ఆంధ్ర దేశాన్ని ముస్లిం
నుంచి విముక్తిచేసి, వారిని పారద్రోలడానికి ఒక స్వాతంత్ర్యో
ద్యమాన్ని లేవదీసినది ముఖ్యంగా కమ్మనాయకులే. కమ్మనాం
కులు ముస్లిములతో ఎన్నో యుద్ధాలు చేశారు.

కృష్ణదేవరాయల కాలంలో గండికోట ప్రభువుగా
వేలమంది కమ్మ సైనికులకు నాయకుడుగా పెమ్మసాని రామ
గప్ప నృపాలుడు పేరుపొందినాడు.

ఉత్తర భారతావనినుంచి దక్షిణా పథానికి ఆర్య

వలసవచ్చినది మొదలు కాకతీయాంధ్ర రాజుల కాలంలో, విజయనగర రాజుల కాలంలో కమ్మనాయకులు ఏవిధముగా దేశపరిపాలన, రక్షణలతో విపుల బాధ్యతలను నిర్వహించినదీ, చారిత్రక శాసనాధారాలతో వివరించబడిన ఉత్తమపరిశోధన గ్రంథమిది. ఇతిహాసపరిశీలకులు శ్రీ లక్ష్మీనారాయణగారు ఈగ్రంథ రచనకు చేసినకృషి మెచ్చతగ్గది./10-2-57 ఆంధ్రప్రభ.

III

ఉత్తర భారతవర్షమునుండి దక్షిణాపథమునకు వలస వచ్చిన ఆర్యులలో ఒక తెగ కూర్మ్మలు; వారు రాజ్యపాలనచేత క్షత్రియులైరి. వారివంశీకులు కూడ అనగా రెడ్డి, కాపు, తెలగ, కమ్మలు క్షత్రియులే —

ఇది అనేకములైన శాసనాలు, చరిత్రలు, పురాణాలూ పరిశోధించి ప్రాచీన చరిత్రకారుల వ్రాతలలోని విపరీత భావాలను, వింతనిర్ణయాన్ని సోపపత్తికంగా ఖండించి సప్రమాణంగా మృదుపద పద్ధతిలో తనవాదాన్ని ఋజువుచేసుకొని కమ్మవారి పుట్టు పూర్వోత్తరాలను సమగ్రంగా, ఉదారంగా తెలిపే చరిత్ర గ్రంథము; ఈ గ్రంథరచనలో లక్ష్మీనారాయణగారి చారిత్రక విషయ వివేచనాప్రతిభ సర్వవిధాలా శ్లాఘ్యమైఉంది. అడుగడుగునా శాసనాలు, చరిత్రలూ, ప్రమాణాలూ వచ్చి లక్ష్మీనారాయణగారి వాదాన్నీ, పరిశోధనా పటిమనూ మనచేత ఔననిపించుతూ ఒప్పించుతూ మనచేత మెప్పించుతాయి. కాదనడానికి వీలులేని వ్రాత. దీనివల్ల ఆంధ్రదేశంలో కమ్మవారి ప్రాచీనత, ప్రాభవం ఎల్లాఉండేదో నిర్దుష్టంగా తెలుసుకో వచ్చు. ఉత్తమమైనకృషి. — 3-3-1957 — ఆంధ్రపత్రిక

# భారతీయ సమాజంపై ఆంగ్లవిద్యా ప్రభావం

I

రచయిత ఈ వ్యాసంలో, ప్రాచీన విద్యావిధానాన్నీ, ఆధునిక విద్యావిధానాన్ని పోల్చి, వానిలోని మంచి చెడ్డలను వివరించారు. మాతృభాషను, జాతీయ భాషను ప్రోత్సహిస్తూనే, ఆంగ్లేయ భాషవలన మనకు కలిగిన విజ్ఞానాన్ని రచయిత వివరించారు. 24-11-'57—విశాలాంధ్ర

II

"పరిశోధించి తెలుసుకొన్న చారిత్రక సత్యాలను నిర్మొగమోటంగాను, నిదర్శనపూర్వకంగాను చెప్పడంలో సిద్ధహస్తులు శ్రీ లక్ష్మీనారాయణగారు. అందరికీ అందుబాటులో ఉండే విధంగా చిన్న చిన్న చారిత్రక కరపత్రాలను రచించడంలోను, ప్రచురించడంలోను, వారికొక విశిష్టతఉంది. ఈ కరపత్రం ద్వారా వారీ విషయాలను మరింతగా ధ్రువపరచుకొన్నారు"

ఆంధ్రప్రభ—జూన్ 2—1957

రామాయణ విమర్శనము — "విమర్శనాత్మకములైన కావ్యాలలో శ్రీ కొడాలి లక్ష్మీనారాయణగారి 'వాల్మీకి రామాయణ విమర్శనము' విజ్ఞానప్రదమైఉంది." —యా. పద్మనాభస్వామి

**Lakshminarayana, Kodali.**

B. 14 May 1908; add. Moparru, Tenali Tq., Guntur Dt.; published seventeen books; some pubi History of Andhra Villages, A Criticism of Ramayana, A Criticism of Mahabharata; well-known historian.

'Who's who'—p 31.
Editor Velury Sahajanand

## ENGLISH EDUCATION

*From:* LONDON
BERNARD SHAW. 5-1-48.

You are right; but Gandhi also is right. India can never keep pace with Europe until her dozen dialects are swept away and replaced by a fully developed common language. Clearly that language is English in virtue of its being already established to some extent.

But do not spoil this main point by opposing Gandhi. The caste system is just as rampart in English education as in India. Although the Italian proverb "Rule by the stranger is just" held good between the medieval Italian cities and between Guelf and Ghibelline, the fact remains that a century of English rule has left India practically illiterate.

The language taught in your schools must be English; but your education authorities must be Native Indian. Cannot you and Gandhi shake hands on this? *(Sd.) G. B. S.*

## Bibliography

G. Mackenzie — Kristna District manual.
Govt. publications — All District manuals
— Arch. Survey of India Volumes.
— A guide to Guntur.
— Guide to the records of Machula.

Bishop caldwell — Dravidian comparative grammar
K. R. Venkatarama Ayyer — A manual of Pudukotai state.
N. Thyagarajan — ,,
Sewell — Historic inscriptions of south India.
W. Elliot — Coins of South India
N. Venkatarao — The Southern school in Telugu literature.
R. Satyanatha Ayyer — History of Nayaks of Madhura
C. Hayanatharao — History of Mysore
R. C. Majumdar — Advanced History of India.
C. S. Sreenivasa chary — History of India
Saletore — History of the Vijayanagara Empire.
K. A. Neelakantha Sastry — History of the Cholas
Gribble — History of the Deccan
S. KrishnaSwamy Ayyangar — Sources of Vijayanagara History
M. Somasekhara Sarma — History of the Reddi kingdoms
— A forgotten chapter in Andhra history
N. Venkatarama nayya — The third dynasty of Vijayanagara empire.

కలనల్ మెకంజీ — లోకల్ రికార్డు సంపుటము
చి. వీరభద్రరావు — ఆంధ్రుల చరిత్ర. 2. 3